

శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# సాంప్రదాయిక వ్యాస మాలిక–14



వటపత్రశాయి పెరుమాళ్, శ్రీవిల్లిపుత్తూర్




'పండితరత్న'
డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# "జయ శ్రీరామ. " అంటే ఏమి?

జయ శ్రీరామ అని అంటూ మనం చెప్పుకుంటామే! . ఈ వాక్యంలోని తాత్పర్యం ఏమి ? రాముడు జయించాలి– అని అర్థం అని అనుకుంటే, రాముడు ఎప్పుడో జయాన్ని పొందాడు కదా. ఇప్పుడు మళ్లీ విజయాన్ని పొందాలని అనడంలో ఏమి అర్థం ఉన్నది? రావణుడు, కుంభకర్ణుడు మొదలైన రాక్షసులను సంహరించి, శ్రీరాముడు జయాన్ని పొందడం అనే విషయమేనా ఈ వాక్యంలో చెప్పబడుతున్నది? ఇంత మాత్రం కానే కాదు. ఇంతకంటే విలక్షణమైన, గంభీరమైన అర్థం ఈ వాక్యం ద్వారా స్ఫురిస్తుంది. ఆ అర్థమేమో కొంచెం గమనిద్దాం.

హనుమానుడు లంకలో అశోకవనంలో ఉండే సీతను చూడడం కోసం వెళ్లేటప్పుడు "జయత్యతిబలో రామః లక్ష్మణశ్చ మహాబలః, రాజా జయతి సుగ్రీవః రాఘవేణాభిపాలితః, దాసో ఽ హం కోసలేంద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః" అని అన్నాడు. మిక్కిలి బలాన్ని కలిగిన శ్రీరాముడు జయిస్తున్నాడు. గొప్ప బలాన్ని కలిగిన లక్ష్మణుడు కూడా జయిస్తున్నాడు. రాఘవునిచేత రక్షింపబడే, వానర ప్రభువు అయిన సుగ్రీవుడు కూడా జయిస్తున్నాడు. కోసల దేశానికి ప్రభువు, అవలీలగా ఎటువంటి కార్యాన్ని అయినా అవలీలగా చేయగలిగినవాడు అయిన రామునకు నేను దాసుడను" అని అంటున్నాడు. ఈ వాక్యంలో కూడా "రాముడు జయిస్తున్నాడు" అనే అర్థమే చెప్పబడింది. ఇటువంటి వాక్యాలలో రాజ్యాన్ని జయించడం, దుష్టులను సంహరించడం– అనే

అంత మాత్రమే అర్థం కాదు. ఇంతకంటే విలక్షణమైన అర్థం వేరొకటి ఈ వాక్యాలలో ఉన్నది.

" జితం తే పుండరీకాక్ష! నమస్తే విశ్వ భావన! " అని అంటూ జితంతే స్తోత్రంలో అనుసంధింపబడుతున్నది. "పుండరీకాక్షా! నీవు విజయాన్ని పొందుతున్నావు. జయం నీదే"– అని ఈ సూక్తిలోని తాత్పర్యం. ఈ వాక్యాలను ఎవరు చెబుతున్నారు? రామునిచేత జయింపబడిన జయింపబడిన రాక్షసులు కారు, అసురులు చెప్పడం లేదు. ఇక ఎవరు చెబుతున్నారు? అంటే, సత్పురుషులు చెప్పే వాక్యమే. ఇది ప్రతి దినం భగవంతుని ఆరాధనలో మనం అనుసంధానం చేసుకొనే సూక్తి ఇది.

శ్రీరాముడు జయించడం అసురులను, రాక్షసులను, దుర్మార్గులను మాత్రమే కాదు, మహనీయులను, సత్పురుషులను కూడా జయిస్తున్నాడు. అయితే, మంచివారిని జయించడం అంటే ఏమి అర్థం? మనం ఏదో ఇది ఒక స్లోగన్ వాక్యమని, మనం సనాతన ధర్మాన్ని అనుసరించేవారం– అని వ్యక్తం చేయడం కోసం చెప్పే వాక్యమని, ఇంత మాత్రమే భావించరాదు. "నేను రామదూతను, రామునకు దాసుడను" అనే అర్థాన్ని చెప్పడానికి ఇది ఉపకరించే వాక్యం అనడంలో ఏ సందేహం లేదు. "రామో జయతి" "–రాముడు జయిస్తున్నాడు" అని అంటే, "మనం ఆ రాముని చేతిలో ఓడిపోతున్నాము"– అనే కదా అర్థం. మనం ఆ విధంగా ఓడిపోతున్నామా? ఆ ఓడిపోవడం ఎటువంటిది? ఈ విషయాన్ని గమనించాలి.

మనం ఓడిపోవడం అంటే –శ్రీరాముని కల్యాణగుణాలు జయిస్తున్నాయి, శ్రీరాముని స్వభావం జయిస్తున్నది. మన కర్మలు ఓడిపోతున్నాయి– అని అర్థం. ఇది ఎవరికో కొంత మందికి సంబంధించినది మాత్రం కాదు. ఇది లోక సాధారణం. "జయ శ్రీరామ" అనే ఈ సూక్తి ఏదో కొంతమందికి మాత్రం చెందినది కాదు. లోకానికి అంతటికి కల్యాణాన్ని కలిగించేది "జయ శ్రీరామ" అనే

సూక్తి.

ఈ రామశబ్దంతో శ్రీ అనే పదంకూడా చేరి ఉన్నది. ఇక్కడ శ్రీ అనే పదం లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవిని తెలుపుతుంది. అందుచేత, "జయ శ్రీరామ" అని అంటే – సీతాదేవీ సహితుడైన శ్రీరాముడు జయిస్తున్నాడు –అని అర్థం సీతతో కూడి ఉండే రాముడు జయిస్తున్నాడు– అని అర్థం. అయితే, మరి, సీత లేకపోతే రాముడు ఓడిపోతాడా? అని అంటే ఓడిపోడు. కానీ, మనకు లభించే భగవదనుగ్రహం పరిమితమైపోతుంది. సీత శ్రీరాముని దగ్గర లేకపోతే, శ్రీరాముడు మన దోషాలను చూసి, మనపై కోపిస్తాడు. "సీతాదేవి శ్రీరామునితో కూడి ఉంటే అతడు జయిస్తున్నాడు", అనేదానికి ఒక ధ్వన్యర్థం ఉన్నది.

రావణునితో యుద్ధం చేసి జయించడంలో, కుంభకర్ణునితో యుద్ధం చేసి జయించడంలో శ్రీరాముడు సీతాదేవితో కలిసి ఉండడానికి, ఉండకపోవడానికి ఏ తేడా లేదు. కానీ, ఈ లోకాన్ని అంతటిని రామచంద్రప్రభువు సృష్టించాడు. మనమందరం ఆ స్వామికి భక్తులు కావాలి– అని అతడు ఆశపడతాడు. కానీ, మనలను చూస్తే, మనం

లౌకికమైన విషయాలలో నిమగ్నులమై ఉన్నాము. ఈ విధంగా ఉండే మన స్థితి మారి, మనం ఎప్పుడు ఆ స్వామికి భక్తులం అవుతామో, రాముడే సర్వస్వం అని తెలిసి కొంటామో, ఆనాటికి కదా రాముడు చేసిన ఈ సృష్టి సఫలం అవుతుంది– అని ఈ సూక్తిలోని తాత్పర్యం. ఆ స్వామి చేసిన సృష్టి సఫలమైనది– అని అంటే మనం ముక్తిని పొందడానికి ఆశను కలిగినవారం కావాలి. "శ్రీరాముని చరణాలే శరణం" అని నిశ్చయించుకుని, ఆశ్రయించాలి. ఆ విధంగా ఉండే స్థితిని మనకు కలిగించడమే సీతాదేవి చేసే పని.

సీతాదేవి ఆ పురుషకారాన్ని చేసింది. మనం రామభక్తిని కలిగి ఉన్నాము– అంటే, అప్పుడు రాముని కార్యం సిద్ధించింది, కనుక, రాముడు జయిస్తున్నాడు. ఈ విధంగా కాకుండా, సీత శ్రీరామునితో లేకపోతే, ఆ స్వామి కంటికి ఆమనపాపాలు గోచరించి, ఆ స్వామి మనపై చూపించే దయ సంకుచితమైపోతే, ఇక మనం ఈ సంసారంలో పడి బాధ పడతాము. అప్పుడు శ్రీరాముని కార్యం జయించదు. అతడు చేసిన సృష్టి సఫలం కాదు. అందువల్ల, సీతాదేవి రామునితో ఉన్నప్పుడు రాముడు జయిస్తున్నాడు.

అందుచేత, "జయ శ్రీరామ" అనే సూక్తి శ్రీరాముడు ఎవరితోనో ఎప్పుడో యుద్ధం చేసి జయించిన సందర్భానికి సంబంధించినది మాత్రమే కాదు కాదు. అది పూర్తిగా లేదని అర్థం కాదు. ఆ అర్థం కూడా ఉన్నది. కాని, వాస్తవానికి, "మన పాపాలన్నీ తొలగిపోతున్నాయి, రామునకు కల క్షమ, దయ, వాత్సల్యం మొదలైన కళ్యాణ గుణాలు జయిస్తున్నాయి,

సీతాదేవి చేసిన పురుషకారం సిద్ధించింది"– అనే ఈ విషయాలన్నీ కలిపి "జయ శ్రీరామ "అనే సూక్తి ద్వారా వ్యక్తమవుతున్నాయి– అని మనం భావించాలి.

అందువల్ల, మనమంతా "జయ శ్రీరామ" అని అందాం. ఆ వాక్యం అర్థవంతం కావడానికి ప్రయత్నం చేద్దాం

# రామానుజం లక్ష్మణ పూర్వజం చ

లంకానగరంలో సీతాదేవి అశోకవనంలో బంధింపబడి ఉన్నది. ఆంజనేయ స్వామి ఆమెను అన్వేషిస్తూ వచ్చాడు. సీతను కలసి, ఆమెకు శ్రీరాముడు ఇచ్చిన అంగుళీయకాన్ని అందజేశాడు. సీతాదేవి హనుమంతునితో సంభాషించి, రామునకు తెలుపవలసిన సందేశాన్ని హనుమంతునకు చెప్పింది. హనుమంతుడు కూడా రాముడు పంపిన సందేశాన్ని సీతకు తెలియజేశాడు.

ఈ సందర్భంగా సీతాదేవి లక్ష్మణుని, శ్రీరాముని నిర్దేశిస్తూ ఒక అద్భుతమైన పదప్రయోగం చేసినది. లక్ష్మణుని, శ్రీరాముని నిర్దేశిస్తూ, "రామానుజం లక్ష్మణ పూర్వజం చ" అని అన్నది. తాను ఏ విధంగా లంకా నగరానికి తీసుకుని రాబడినదో, ఆ విషయాన్ని సీతాదేవి తెలియజేసే సందర్భం ఇది. " నేను ఆ మాయా మృగానికి తీసుకొని రమ్మని శ్రీరాముని పంపించి ఉండకూడదు. ఆ విధంగా పంపించడం చాలా తప్పు. సరే, ఒకవేళ అతడు వెళ్ళినప్పటికీ, ఆ తరువాత కూడా నేను మోసపోయి లక్ష్మణుని కూడా అతని వెంట వెళ్ళమని చెప్పి, పంపించి ఉండకూడదు. ఆ పనిని కూడా చేశాను. ఈ విధంగా ఇద్దరినీ నేను పంపించడమే చాలా తప్పు అయినది. నా ఈ దుఃఖానికి అంతటికి అదే మూల కారణమైనది" అని అంటున్నది.

ఇక్కడ, సీతాదేవి "రాముడు, లక్ష్మణుడు" అని వారిద్దరి పేర్లను నేరుగా నిర్దేశించి ఉండి ఉండవచ్చు. కానీ, ఆమె ఆ విధంగా నిర్దేశించకుండా, వేరే

విధంగా నిర్దేశించింది. లోకంలో వారి వారికి కల పేర్లు కదా వారికి గుర్తులు. సీత ఆ విధంగా వారి పేర్లను చెప్పలేదు లక్ష్మణుని గురించి చెప్పేటప్పుడు, "రామానుజమ్" అని "రామునకు తమ్ముడు" అని చెప్పింది. లక్ష్మణుడు అని నేరుగా చెప్పకుండా, అతనిని "రామునకు తమ్ముడు" అని నిర్దేశించి పలికింది. ఈ విధంగా రాముని గుర్తుగా చేసుకొని, లక్ష్మణుని పేరును నిర్దేశించినది.

సరే, అది ఉండనివ్వండి. లక్ష్మణుడు రామునకు తమ్ముడు. అన్ని విధాలుగాను అతనికి శేషభూతుడు. అందువల్ల రాముని పురస్కరించుకొని లక్ష్మణునికి చెబితే చెప్పి ఉండవచ్చు. కానీ. రాముని గూర్చి చెప్పేటప్పుడు "లక్ష్మణ పూర్వజం చ" అని అన్నది. పూర్వజుడు అంటే, ముందు పుట్టినవాడు. లక్ష్మణ పూర్వజుడు అంటే, లక్ష్మణునకు ముందు పుట్టినవాడు, అంటే, రాముడు –అని అర్థం. ఈ విధంగా రాముని పేరును నేరుగా చెప్పలేదు లక్ష్మణుని పేరును కూడా నేరుగా చెప్పలేదు. సీతాదేవి ఎందుకు ఈ విధంగా వీరి ఇద్దరి పేర్లను పరోక్షంగా నిర్దేశించింది? సాధారణంగా ఎవరినైనా నిర్దేశించేటప్పుడు వారి పేర్లను పురస్కరించుకుని నిర్దేశిస్తామా? లేక, ఆ వ్యక్తికి అన్న, తమ్ముడు, తల్లి, తండ్రి, అక్క, చెల్లెలు అని ఈ విధంగా ఉండే వ్యక్తుల పేర్లను పురస్కరించుకొని, వారితో సంబంధం కలిగినవారు అని నిర్దేశిస్తామా? సీతాదేవి ఈ విధంగా శ్రీరాముని, లక్ష్మణుని వారి పేర్లతో నేరుగా నిర్దేశించకుండా, పరోక్షంగా, ఇంకొకరి పేరును పురస్కరించుకొని నిర్దేశించడానికి ఒక ముఖ్యమైన కారణం ఉన్నది.

జీవులమైన మనం భగవంతునకు శేషభూతులం. ఆ భగవంతుని పురస్కరించుకునే మనం నిర్దేశింపబడుతున్నాము. మనం భగవంతునకు దాసులం. ఆ స్వామిని నమ్మి, ఆయనపై ఆధారపడి మనం ఉన్నాము. భగవంతుని విడచి మనం ప్రత్యేకంగా ఉండగలిగే అవకాశం ఎంత మాత్రం లేదు. అందుచేత పరమాత్మకు జీవాత్మ శేషం. ఆయనపై ఆధారపడి ఉండేవాడు అందుచేత, జీవుని నిర్దేశించేటప్పుడు, భగవంతుని సంబంధాన్ని పురస్కరించుకొని నిర్దేశించవచ్చు. అందుచేత, "రామానుజమ్" అనే నిర్దేశం, సరే, బాగున్నది, అర్థవంతంగా కూడా ఉన్నది.

కాని, భగవంతుని నిర్దేశించేటప్పుడు, అతడు మనకు స్వామి అని నిర్దేశించడం ఏమి? ఆ విధంగా కదా సీతాదేవి ఇక్కడ పలికింది. రాముని లక్ష్మణుని సంబంధాన్ని ముందు ఉంచుకుని కదా పలికింది. రాముని నిర్దేశించేటప్పుడు "లక్ష్మణునకు అన్న" అని అన్నదికదా. దీనివల్ల ఏమి అర్థం వస్తున్నది? లక్ష్మణుని నమ్మి శ్రీరాముడు ఉన్నాడు –అని కదా అర్థం వస్తున్నది. అంటే, జీవాత్మను ఆశ్రయించుకొని భగవంతుడు ఉన్నాడు, లక్ష్మణుని ఆశ్రయించుకుని శ్రీరాముడు ఉన్నాడు– అనే అర్థం ఇక్కడ వస్తుంది.

రాముని ఆశ్రయించుకుని లక్ష్మణుడు ఉన్నాడు– అని అనడం బాగున్నది. కానీ, లక్ష్మణుని ఆశ్రయించుకుని రాముడు ఉన్నాడు– అని అనడం ఏమి? మనవంటి జీవాత్మలను ఆశ్రయించుకొని పరమాత్మ

ఉన్నాడు- అని అనడమే కదా. ఇది. ఈ విధంగా పలకడం సరిపోతుందా? అని అంటే.

తప్పక సరిపోతుంది. జీవపరమాత్మల సంబంధం పారస్పరికం. జీవుడు, పరమాత్మ అనే వారు ఇద్దరూ ఒకరిని ఇంకొకరు పరస్పరం ఆశ్రయించుకుని ఉన్నారు. మనం లేకపోతే భగవంతుడు లేడు. భగవంతుడు లేకపోతే మనం లేము. ఈ విధంగా ఒకరిపై ఇంకొకరు ఆశ్రయించుకుని ఉన్నప్పటికీ, ఇక్కడ ఒక ముఖ్యమైన భేదం ఉన్నది.

ఏ విధంగా అయినా, జీవుడు భగవంతునిపై ఆధారపడకుండా ఉండలేడు. మనకు ఇష్టం ఉన్నా లేకపోయినా, మనం భగవంతునిపై ఆధారపడకుండా ఎంత మాత్రం ఉండలేము. భగవంతుడు లేకపోతే ఆత్మ ఉండలేదు, తత్వం ఆ విధంగా కాకపోతే " జీవుడు భగవంతుని ఆశ్రయించుకుని ఉన్నాడు. భగవంతునకు శేషభూతుడు" అని చెప్పే అవకాశం లేదు. ఆ భగవంతునకు మనం సొత్తు, శేషం, దాసభూతులం మనం. ఈ విధంగా శేషమై ఉండడం అనేది మనకు ఇష్టం ఉన్నా, లేకపోయినా, ఆ విధంగా భగవంతునకు శేషమై ఉండడం-అనేది మన స్వరూపంలోకి చేరుతుంది. సహజంగానే మనం భగవంతునకు శేషమై ఉన్నాము, ఆయనపై అన్ని విధాలుగా ఆధారపడి ఉన్నాము.

కానీ, భగవంతుడు మనపై ఆధారపడి ఉండడం అనేది ఈ విధంగా స్వరూపాత్మకం కాదు, అది భగవంతుని కేవలం ఇచ్ఛాహేతుకం, సంకల్ప హేతుకం. మనలను ఆశ్రయించుకుని ఉండకపోతే భగవంతుడు ఉండడు- అనే విషయం లేదు. ఆ విధంగా భావించరాదు. భగవంతుడు

జీవుని పై ఆధారపడడం అనేది ఆ స్వామి సంకల్పం చేత ఏర్పడినది తప్ప, స్వరూపం వల్ల ఏర్పడినది కాదు. "ఈ భక్తుడు నాకు చాలా ఇష్టమైన వాడు. దగ్గరివాడు. ఇతడు లేకపోతే నేను ఉండలేను" అనే ప్రీతితో భగవంతుడు తన భక్తునిపై ఆధారపడి ఉంటాడు. అంతే. ఈ విషయాన్ని శ్రయామునాచార్యులవారు స్తోత్రరత్నంలో "క్షణేపి తే యద్విరహః అతిదుస్సహః" అని అన్నారు. భక్తులను విడచి ఒక్క క్షణం కూడా భగవంతుడు ఉండలేడు. ఆ విధంగా అయితే, భక్తుని చూడకపోతే, భక్తినితో కలసి ఉండకపోతే, భగవంతుడనేవాడు లేకుండా పోతాడా? అంటే, ఆ విధంగా ఉండదు. భక్తునితో కలసి ఉండకపోతే, భగవంతుడు మనస్సులో చాలా బాధపడతాడు. కానీ, అతని అస్తిత్వానికి లోటు మాత్రం ఉండదు. పరమాత్మను ఆధారపడి ఉండకపోతే ఆత్మకు అస్తిత్వం అనేదే లేదు. భగవంతుని విషయంలో ఈ సంబంధం అటువంటిది కాదు, ఐచ్ఛికం. అందుచేత జీవుడు, భగవంతుడు అనే ఈ ఇద్దరు ఒకరిని ఒకరు ఆశ్రయించుకునే ఉన్నారు– అని అనడంలో ఏ సందేహం లేదు. కానీ. ఇక్కడ భేదం ఉన్నది. " నాన్ ఉన్నై యన్ఱి ఇలేన్ కండాయ్, నారాయణనే! నీ ఎన్నై యన్ఱి ఇలై" అని అంటూ ఈ జీవపరమాత్మల పారస్పరిక సంబంధాన్ని ఆళ్వార్లు కూడా తెలియజేశారు.

అందువల్ల, భగవంతుని జీవుడు ఆశ్రయించుకుని ఉండడం– అనేది విధి. స్వరూపాత్మకమైనది. భగవంతుని విషయంలో స్థితి అటువంటిది కాదు. అది భగవంతుని సంకల్పాధీనమైనది. భక్తుని ఆశ్రయించుకుని

మాత్రమే భగవంతుడు ఉండగలడు– అనే నియమం లేదు. కానీ, భగవంతుడు ప్రీతి కారణంగా ఏనాడు భక్తుని విడవలేడు.

ఈ విధంగా ఉండే పారస్పరికమైన జీవపరమాత్మల సంబంధాన్ని తెలియజేయడం కోసమే సీతాదేవి "రామానుజం లక్ష్మణ పూర్వజం చ" అని అన్నది. రాముడు, లక్ష్మణుడు– అనే ఈ ఇద్దరినీ, వారి పేర్లను చెప్పి నిర్దేశించకుండా, "లక్ష్మణుడు రామునకు తమ్ముడు, శ్రీరాముడు లక్ష్మణులకు అన్న" అని ఇంకొకరి పేరుతో మరొకరిని నిర్దేశించింది.

ఈ అందమైన, సాంప్రదాయికమైన రహస్యార్థాన్ని ఇక్కడ మనం గమనించాలి.

# జీవుల జన్మలలోని సామ్యం

"పిఱప్పొక్కుమ్ ఎల్లా ఉయిర్ క్కుమ్" – (జీవులందరికీ జన్మ సమానం) అని తిరువళ్లువర్ తిరుక్కుఱళ్ లో అన్నారు. అయితే గమనించి చూస్తే, వస్తుస్థితి ఆ విధంగా కనిపించడం లేదే! ఆ సూక్తికి ఏ విధంగా అర్థాన్ని గ్రహించాలి ?అనే సందేహం మనకు కలగవచ్చు. ఏమి? సందేహానికి ఏమి అవకాశం ఉన్నది? అని అంటే, ఇక్కడ జన్మ అనే పదంచేత ఏమి వివక్షింపబడుతున్నదో, ఆ విషయంలో సామ్యం ఉండాలి కదా! అనేది ఇక్కడ ప్రశ్న.

జన్మ అంటే శరీరేంద్రియాలకు, ఆత్మకు ఏర్పడే సంబంధమే కదా. ఈ జన్మ ఏర్పడే విధానంలో సామ్యం ఎక్కడ కనిపిస్తున్నది? లేదే! ఒకరు మగవారుగా, ఇంకొకరు ఆడవారుగా, ఒకరు ధనవంతులుగా, ఇంకొకరు దరిద్రులుగా, ఒకరు పొట్టివారుగా, ఇంకొకరు పొడగరిగా, ఒకరు తెల్లగా ఉండే రంగుతో, ఇంకొకరు నల్లగా ఉండే రంగుతో, ఈ విధంగా పుట్టుకలో అనేక విధాలైన భేదాలు కనపడుతున్నాయి కదా. సామ్యం ఎక్కడ ఉన్నది?. ఈ సూక్తిలో చెప్పబడిన సామ్యం కేవలం మానవులకు మాత్రమే సంబంధించినది కాదు. ఆత్మలన్నిటికి– అని చెప్పబడింది. ఆ విధంగా చూసినప్పుడు. ఈ సామ్యం అసలు పొసగడం లేదే! మానవులు, జంగమాలు, స్థావరాలు దేవతలు, అని ఈ విధంగా ఉండే జీవులలో భేదం కనిపిస్తున్నదే కానీ, సామ్యం ఎక్కడ కనిపిస్తున్నది?

ఇక్కడ కేవలం మానవులలోనే ఈ అర్థం వివక్షితం– అని అనుకున్నా, అది కూడా కుదిరే అవకాశం కనబడడం లేదు. ఇంతకుముందు

చెప్పినట్లుగా, ఆడ మగ తేడా, పుట్టిన చోట్ల తేడా, వంశాలలో తేడా, శరీరాకృతిలో తేడా, స్వభావంలో తేడా, గుణాలలో తేడా, ఏ విధంగా చూసినా లోకంలో జీవులలో తేడాలే కనిపిస్తాయి కదా. ఒక జీవుడు లేదా, ఒక మానవుడు, ఇంకొక జీవునితో, ఇంకొక మానవునితో పోలినట్లుగా తోచడం లేదే! ఏదో ఒకటి రెండు అంశంలో అయినా సామ్యం ఉంటే కదా, ఈ విధంగా సూక్తిని పలికే అవకాశం ఉన్నది ఈ సూక్తిని పలికినవారు సామాన్యులు కాదు. మహాజ్ఞాని ఎంతో అనుభవం కలిగినవారు. అందుచేత ఈ సూక్తికి ఏ విధంగా అర్థం చెప్పుకోవాలి? అనేది ఇక్కడ సందేహం.

నిజమే! ఈ సందేహం మనకు అర్ధవంతంగానే, సహేతుకంగానే కనిపిస్తుంది. ఏ విధంగానూ జీవుల మధ్య సామ్యం లేనట్లుగానే తోస్తుంది. ఒక జీవుడు ఇంకొక జీవునితో, ఒక మానవుడు ఇంకొక మానవునితో పోలినట్లే కనిపించదు కదా.

అయితే, ఈ విషయంలో కొంచెం లోతుగా గమనించి చూసినప్పుడు, జీవుల జన్మకు కారణం, ఆ జన్మల ప్రయోజనం– అనే రెండు విషయాలలో జీవులందరికీ స్పష్టంగా సామ్యం గోచరిస్తుంది. ఇదే సృష్టిలోని ఆశ్చర్యకరమైన రహస్యం. ఎవరినైనా చూచి, "నీవు ఎందువల్ల పుట్టావు? అని ప్రశ్నించాము అనుకోండి. అప్పుడు అతడు ఏమని సమాధానం చెబుతాడు? " నేను గతంలో చేసుకొన్న కర్మల ఫలంగా ఈ విధంగా పుట్టాను" అని కదా అంటాడు. కర్మల కారణంగానే కదా ఈ జన్మలు ఏర్పడుతున్నాయి. ఆత్మకు శరీర సంబంధం కర్మల వల్ల

కలుగుతున్నది. చేసినది పుణ్యం కావచ్చు, పాపం కావచ్చు, ఏ విధమైన కర్మను ఒక జీవుడు గతంలో చేస్తాడో, ఆ కర్మను అనుసరించి అతడు మరుజన్మలో జన్మిస్తాడు. అందువల్ల ఎవరి జన్మకు అయినా, వారు గతంలో చేసుకొన్న కర్మలే కారణం అందరి కర్మలు ఒకటే– అని చెప్పలేము కదా. జీవుల కర్మలలో వైవిధ్యం అనేది స్పష్టమైన విషయం.

ఇక, సామ్యానికి రెండవ కారణం ఏమంటే, జన్మప్రయోజనం. "నీవు ఏ ప్రయోజనం కోసం పుట్టావు?" అని ఎవరినైనా ప్రశ్నిస్తే, "నీవు ఎందుకోసం పుట్టావు?"అని ఎవరినైనా అడిగితే, ", నా కర్మల ఫలాన్ని అనుభవించడం కోసం పుట్టాను, అనుభవించి ఆ కర్మలను తీర్చుకోవడం కోసం పుట్టాను", అని కదా సమాధానం పలుకుతాడు. జన్మిస్తే కదా గతంలో చేసిన, జన్మల పలాన్ని అనుభవించడానికి వీలవుతుంది. ఆ విధంగా పూర్వకర్మలను తీర్చుకోగలం! జన్మిస్తే కదా, ఈ శరీరంతో పుణ్యకర్మలను చేసి, గతంలో చేసిన పాపకర్మల ప్రభావాన్ని తగ్గించుకోగలం! తీర్చుకోగలం! . ఎన్ని కర్మలను తీర్చీకున్నాము? ఎంతవరకు తీర్చుకున్నాము? ఏ విధంగా తీర్చుకున్నాము? అనేది వేరే విషయం. కానీ, సామాన్యంగా "ఎందుకు పుట్టావు ?"అని అడిగితే, "నా కర్మల ఫలాన్ని అనుభవించడం కోసం పుట్టాను, కర్మలను తీర్చుకోవడం కోసం పుట్టాను" అని కదా, సమాధానం వస్తుంది. కర్మలను తీర్చుకోవడం–< అనే ప్రయత్నంలో ఆ వ్యక్తి పూర్తిగా జయాన్ని పొందవచ్చు, లేక, పాక్షికంగా జయాన్ని పొందవచ్చు, లేక, ఓడిపోవచ్చు కూడా. కానీ, జన్మప్రయోజనం మాత్రం కర్మల ఫలాన్ని అనుభవించడమే.

ఈ విధంగా జీవులందరి జన్మలకు ఈ రెండు విషయాలలో స్పష్టంగా సామ్యం ఉన్నది. అందువల్ల "పిఱప్పొక్కుమ్ ఎల్లా ఉయిర్ క్కుమ్" అనే సూక్తి చాలా గంభీరమైనది, వాస్తవమైనది కూడా. ఈ సూక్తిలో వేదార్థం, పురాణేతిహాసాల సూక్తుల అర్థం ఎంతో అందంగా ఇమిడి ఉన్నది కదా.

ఈ రహస్యాన్ని జడభరతుడు అనే మహాజ్ఞాని అయిన ముని ఒక ప్రభువుతో చెప్పాడు ఆ ప్రభువుతో ఆ ముని "రాజా! నీవు ఎవరినీ, ఎక్కడ నుంచి వచ్చావు, ఎందుకోసం వచ్చావు– అనే ప్రశ్నలను మాత్రం నీవు ఎవరిని అడగకు సుమా! . ఈ మూడు ప్రశ్నలకు ఎవరు సమాధానం చెప్పినా, ఒకే విధమైన సమాధానాన్ని తెలియజేస్తారు. ఎవరిని అయినా, "నీవు ఎవరు?" అని అడిగావు అనుకో, "నేను ఒక ఆత్మను, నీవు ఒక ఆత్మవు" అని సమాధానం చెబుతారు. " నీవు ఎవరో నేను కూడా అతడినే" అని అంటారు. ఇక, " నీవు ఎక్కడ నుంచి వచ్చావు?" అని అడిగితే, " నీవు నీ తల్లి గర్భం నుండి వచ్చినట్లుగానే, నేను కూడా నా తల్లి గర్భం నుండి వచ్చాను. ఈ విషయంలో మనం ఇద్దరం పోలి ఉన్నాము" అని అంటాడు. ". ఎందుకోసం వచ్చావు?" అని అడిగితే, " నీవు కర్మలను అనుభవించడం కోసం ఈ లోకానికి వచ్చినట్లుగానే, నేను కూడా కర్మానుభవాన్ని పొందడానికి ఈ లోకంలోకి వచ్చాను" అని అంటాడు.

అడిగిన ప్రభువు పల్లకిలో కూర్చున్నాడు, సమాధానం చెప్పే ముని ఆ పల్లకిని మోస్తున్నాడు. "రాజు కూర్చుని ఉండే పల్లకిని నేను మోస్తున్నానే! " అని చింత ఏమాత్రం ఆ మునికి లేదు. ఆ ముని ఆ

రాజుతో చెబుతూ, " నీవు పల్లకిలో కూర్చుని, నీ కర్మల అనుభవాన్ని నువ్వు పొందుతున్నావు. నీవు కూర్చున్న పల్లకిని నేను మోస్తూ నా కర్మల అనుభవాన్ని నేను తీర్చుకుంటున్నాను. ఇద్దరం మన కర్మానుభవాలను తీర్చుకునేవారమే.. అందుచేత, మనం ఇద్దరం కూడా ఈ లోకంలోకి కర్మానుభవాన్ని పొందడానికి వచ్చినవారమే సుమా! అందుచేత, ఇటువంటి ప్రశ్నలను నీవు ఎవరిని అడగకు సుమా! " అని అన్నాడు.

ఈ కథ భాగవతంలోనూ, శ్రీవిష్ణుపురాణం మొదలైన పురాణాలలోనూ ప్రస్తావింపబడిన అరుదైన కథ. అందుచేత, జీవుల జన్మలలో సామ్యం ఉన్నది జన్మకు కారణంలోనూ సామ్యం ఉన్నది. జన్మల ప్రయోజనంలోనూ సామ్యం ఉన్నది.

# అడవి కాచిన వెన్నెల కావద్దు

ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధాలకు పూర్వాచార్యులు వ్యాఖ్యానాలను అనుగ్రహించారు. వారు ఒకచోట "కాట్టిలే ఎరింద నిలైవుపోలే" అనే ఒక వాక్యాన్ని అనుగ్రహించారు దీనికి "అడవిలో కాచిన వెన్నెల" అని అర్థం. వెన్నెల తెల్లగా ఉంటుంది. చల్లగా ఉంటుంది. అనుభవించడానికి మధురంగా ఉంటుంది. మనసును ఆకర్షిస్తుంది. ఎంతసేపైనా దానిని చూస్తూనే ఉండాలని అనిపిస్తుంది. అయితే, ఆ వెన్నెల ఎక్కడ ప్రకాశిస్తే ఉపయోగం? అందరూ ఉన్నచోట, అందరూ అనుభవించడానికి వీలున్న చోట, అందరికీ ఉపయోగించే చోట ప్రకాశిస్తే అది సార్థకం అవుతుంది. ఆ విధంగా కాకుండా, అది అడవిలో కాస్తే ఏమవుతుంది? అడవిలో ఆ వెన్నెలను చూసి అనుభవించి ఆనందించేవారు ఎవరు ఉంటారు? అడవిలో మృగాలు మాత్రమే కదా ఉంటాయి! అవి ఆ వెన్నెలను చూసి అనుభవించి, ఆనందించలేవు కదా! ఆ విధంగా కాకుండా, ఆ వెన్నెల గ్రామాలలో, నగరాలలో జనులు నివసించే చోట ప్రకాశిస్తే, వారి ఆనందానికి అది కారణం అవుతుంది, సార్థకం అవుతుంది. వెన్నెలలో విహరించడం కూర్చుని భోజనం చేసి ఆనందించడం చేయవచ్చు. కవులు ఆ వెన్నెలను చూసి తియ్యగా కవిత్వాన్ని చెప్పవచ్చు. ఆ వెన్నెలే అరణ్యంలో కాస్తే, ఈ అనుభవాలు కానీ, అవకాశాలు కానీ, ఏమీ ఉండవు కదా. అందుచేత అడవి కాచిన వెన్నెల అంటే– ఉపయోగం లేనిది, వ్యర్థమైనది పొందవలసిన

ప్రయోజనం పొందడానికి అవకాశం లేనిది–< అని తాత్పర్యం ఈ మాటను మన ఆచార్యులు ఏ అర్ధంలో అన్నారు?

భగవంతుడు అంతు లేని సౌందర్యంతో కళ్యాణ గుణాలతో ప్రకాశిస్తున్నాడు> ఆ స్వామికి ఉండే స్వభావాలు, గుణాలు అంతులేనిది. వాటి అతిశయం కూడా అంతులేనిది. అటువంటి ఆ గుణాలు, స్వభావాలు ఎవరికీ ఉపయోగపడకపోతే, ఎవరూ వాటిని దర్శించి అనుభవించి ఆనందించకపోతే, అవి వ్యర్ధమే కదా అవుతాయి. భగవంతునకు ఎంత అతిశయం ఉన్నప్పటికీ, ఎన్ని గుణాలు ఉన్నప్పటికీ, ఆ గుణాలకు ఎంతటి వైభవం ఉన్నప్పటికీ, అవి ఆ స్వామిని ఆశ్రయించిన భక్తులకు ఉపయోగపడకపోతే, ఆ భక్తుల ఆనందానికి కారణం కాకపోతే, అవి వ్యర్ధమే కదా! అవి అడవి కాచిన వెన్నెలే కదా, అవుతాయి! . అంత గొప్ప గుణాలు భగవంతునకు ఉన్నందునకు ఏమి ప్రయోజనం? ఎప్పుడు సార్ధకం? అవి భక్తులకు ఉపయోగపడినప్పుడు కదా, సార్ధకం అవుతాయి. ఆ స్వామిని ఆశ్రయించినవారికి భక్తిని కలిగించడంలో, కలిగిన భక్తిని పెంపొందించడంలో ఉపయోగపడితే కదా అర్ధవంతం అవుతాయి. అప్పుడే స్వామి స్వభావాలకు, గుణాలకు అందం, అతిశయం కలుగుతాయి ఇది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. భగవంతుని గుణాలు భక్తులకు తప్పక ఉపయోగపడతాయి. ఉపయోగపడేటట్లుగా ఆ భగవానుడు అనుగ్రహిస్తాడు అందులో సందేహం లేదు. ఈ ఉదాహరణ కేవలం విషయం వ్యక్తం కావడం కోసం

ప్రస్తావింపబడినది తప్ప, భగవంతుని గుణాలు ఉపయోగపడేవి కాదు– అనే తాత్పర్యంలో దీనిని ప్రస్తావించలేదు. ఇక, ప్రస్తుత విషయానికి వద్దాం.

ఇప్పుడు ఈ నిదర్శనాన్ని దృష్టిలో పెట్టుకొని, లోకంలో ఉండే సంగతిని గమనిద్దాం. ఒకడు చక్కని గాయకుడుగా ఉన్నాడని అనుకుందాం. ఒకడు చక్కని పండితుడై ఉపన్యాసకుడై ఉన్నాడని భావిద్దాం.. ఆ గాయకుని పాట నలుగురికి ఆనందాన్ని కలిగిస్తే కదా, అతడికి కల గానకళ సార్ధకం అవుతుంది. నలుగురు ఉపన్యాసాన్ని విని విని ఆనందించినప్పుడు దా ఆ ఉపన్యాసకుని సామర్థ్యం ఉపయోగపడినది అవుతుంది. లేకపోతే, వీరికి ఉండే పాండిత్యం, సామర్థ్యం అంతా వ్యర్థమే కదా! ఉపయోగం లేనిదే కదా, అవుతుంది.

ఆళ్వార్లు అందరూ గొప్ప వేదాంతులు. పరమ భక్తులు., గొప్ప జ్ఞానవైశద్యాన్ని కలిగినవారు. వారు ఎక్కడో ఏకాంతంలో ఉన్నవారు అయినప్పటికీ, వారు అనుగ్రహించిన ప్రబంధాలు అన్నీ మనవంటి సామాన్య జనులవద్దకు కూడా వచ్చి చేరుతున్నాయి కదా. ఆ విధంగా వచ్చి చేరినప్పుడే, అవి సార్థకమైనవి అవుతాయి. వ్యర్థం కానివి అవుతాయి.

ఆ విధంగానే " నేను గొప్ప పండితుడను, ఎంతో జ్ఞానం కలిగినవాడను, సామర్థ్యం కలిగినవాడను, అందుచేత నేను ఎవరితోనో కలిసి మెలిసి ఉండనక్కరలేదు ఎవరితోనూ మాట్లాడనక్కరలేదు ఎవరిని లక్ష్యపెట్టనక్కరలేదు. ఇతరులే నన్ను చూసి దూరంగా తొలగిపోవాలి. నేను నేనే. నేనెవరితోనూ కలవనక్కరలేదు", అని భావిస్తూ, ఎవరితోనూ

కలవకుండా ఒంటరిగానే ఒకడు ఉన్నట్లయితే, అతనిలో ఉండే పాండిత్యం, సామర్థ్యం కళావైచక్షణ్యం అంతా ఏ విధంగా ఉపయోగపడినట్లు అవుతుంది? ఉపయోగం లేనిదే కదా అవుతుంది! అది అడవి కాచిన వెన్నెలే కదా!

ఇటువంటి పనిని మన పూర్వాచార్యులు ఎవరూ చేయరు ఏనాడూ చేయరు, చేయలేదు కూడా. వారు ఎంత గొప్ప జ్ఞానులైనా, ఎంత గొప్ప సామర్థ్యం కలిగిన వారైనా, వారు జనసామాన్యానికి దూరంగా ఏనాడు లేరు. వారు, ఎంత గొప్ప సామర్థ్యం కలిగినవారో, అంత సులభులు. ఎటువంటివాడైనా, వారి దగ్గరకు వెళ్ళడానికి వారితో కలవడానికి వీలుగా ఉండే స్వభావాన్ని కలవారు.

అయితే ఈ విషయంలో ఒక కష్టం ఉన్నది. ఒక గొప్ పండితుడు ఉన్నాడని అనుకున్నా అతని పాండిత్యం సామర్థ్యం ఒక దశలో ఉంటుంది అయితే అతడు ఎవరిదో కలసి మెలసి ఉండాలని అనుకుంటాడో, ఎవరి దగ్గరకు చేరుతాడో, వారు ఆ పండితునితో సమానమైన స్థాయిలో ఉండేవారు కాకపోవచ్చు. వారు మనవలె సామాన్యులు అయి ఉండవచ్చు. అప్పుడు, వారు ఆ పండితుని గొప్పతనాన్ని, సామర్థ్యాన్ని తెలుసుకొని దానికి తగినట్లు నడుచుకోకపోవచ్చు. అర్థం లేని ప్రశ్నలను అడగవచ్చు. అగౌరవంగా చూడవచ్చు. ఇటువంటివాటికి అన్నిటికి అవకాశం ఉన్నది. అయితే, ఆ పండితుడు వారి తక్కువగా ఉండే ఈ స్వభావాన్ని చూసి, దూరంగా తొలగిపోడు. తొలగిపోకూడదు కూడా. ఆ విధంగా తొలగిపోతే, అతని పాండిత్యం, సామర్థ్యం వ్యర్థమే అవుతుంది.

ఆళ్వారులు, ఆచార్యులు మనలోని తక్కువదనాన్ని, దోషాలను గమనించి ఉన్నట్లయితే, గమనించి, మనకు దూరంగా ఉండి ఉన్నట్లయితే, వారు ఒక్క సూక్తిని అయినా, ఒక మంచి మాటను అయినా మనకు పలికే అవకాశం ఉన్నదా? వారు ఏ ఉపదేశం చేసి ఉండరుకదా. వారి ఔన్నత్యం ఎక్కడ? మన తక్కువదనం ఎక్కడ? అయినప్పటికీ, వారు ఏ కారణం వల్ల మనతో ఈ తేడా లేకుండా వర్తించారు? ఆరు అమూల్యమైన సూక్తులను అనుగ్రహించారు అంటే, మన దగ్గర ఉండే యోగ్యత కారణం కాదు కదా. వారి దగ్గర ఉండే సౌలభ్యమేకదా దానికి కారణం. ఈ విధంగా పాండిత్యంతో పాటు సౌలభ్యం ఉన్నప్పుడే ఆ పాండిత్యం ప్రకాశిస్తుంది. అది బంగారానికి సువాసన అబ్బినట్లు అవుతుంది.

ఈ స్వభావాన్నే, ఇటువంటి స్వభావాన్నే భగవంతుడు కూడా ఎదురు చూస్తాడు. చాలా గొప్ప పాండిత్యం కలిగిన వాడు ఒకడు ఉండవచ్చు అయితే కేవలం అతడు ఆ పాండిత్యాన్ని కలిగి ఉన్న దానివల్ల అతనికి పరిపూర్ణమైన సంతోషం ఏర్పడదు. అతనికి లేని పాండిత్యం అనేది లేకపోవచ్చు కానీ అతని పాండిత్యాన్ని చూసి భగవంతుడు ఎప్పుడు సంతోషిస్తాడు? ఆ పాండిత్యం పదిమందికి ఉపయోగపడితే కదా సంతోషిస్తాడు! నాకు కల సామర్థ్యాన్ని పాండిత్యాన్ని వినియోగించి జనులకు జ్ఞానాన్ని కలిగిస్తున్నాడా వారికి భక్తి కలిగేటట్లు ప్రయత్నిస్తున్నాడా అతనిలో ఇతరుల పట్ల ఆధార భావం ఉన్నదా కరుణ ఉన్నదా అని కదా భగవంతుడు మాటిమాటికి పరిశీలించి చూస్తాడు.

అయితే, ఒక పండితుడు ఈ విధంగా సామాన్యంగా ఉండే ఇతరులతో కలసినప్పుడు, కలవాలని ప్రయత్నించినప్పుడు కొంత కష్టం కలుగవచ్చు. అసహనం ఏర్పడవచ్చు. అయితే, ఆ విధమైన భావాలను అణచుకొని, వాటిని అన్నిటినీ తట్టుకొని, ఇతరులతో కలిసినప్పుడుకదా, ఆ పాండిత్యం పరిపూర్ణంగా పరిణామాన్ని పొందినది అవుతుంది. పండినది అవుతుంది. "నేను వీరితో కలిసి మనసి ఉండను. వీరితో కలిసి మెలసి మాట్లాడను. వీరిని లెక్క చేయను. నా గొప్పతనం నాదే. నేను నేనే" అని భావించి, దూరంగా ఉన్నట్లయితే, ఆ విధంగా ఉంటే ఉండవచ్చు. ఆ విధంగానే, నిజానికి అతనికి ఆ పండితునితో మిగిలినవారు సమానంగా కాకపోవచ్చు. నిజమే. ఆ పండితుడు సామాన్యులకు దూరంగా ఉండాలని అనుకోవడం కూడా సహేతుకమే కావచ్చు. కానీ, అతనికి కల పాండిత్యానికి అప్పుడు ఏమి ప్రయోజనం సిద్ధించినట్లు అవుతుంది? అది నిరుపయుక్తమే కదా అవుతుంది. అందుచేత, తనకు గల పాండిత్యం ఉపయోగపడడాన్ని గూర్చి ఆ పండితుడు తప్పక చింతించాలి. ఆ విధంగా ఆలోచించినప్పుడు, అతడు ఇతరులతో కలిసి మెలసి ఉండే ప్రయత్నాన్ని తప్పక చేస్తాడు. ఎవరి పాండిత్యం అయినా, ఎవరికి గల గుణాలు అయినా, ఎవరికి గల సామర్థ్యం అయినా, అవి అన్నీ అడవి కాచిన వెన్నెలవలె వ్యర్థం కాకూడదు. ఇతరులకు అవి ఉపయోగపడాలి. ఉపయోగపడేటట్లుగా వారు తప్పక ప్రయత్నం చేయాలి.

అందువల్ల, ఏ కళలో అయినా, ఏ శాస్త్రంలో అయినా, ఎవరైనా, ఆ కళ, ఆ శాస్త్రం, వారు, సార్ధకం అయ్యేటట్లు ప్రయత్నం చేయాలి. అవి నలుగురికి ఉపయోగపడే రీతిలో ప్రయత్నం చేయాలి. ఆ విధంగా చేసినప్పుడే, అతనికి గల పాండిత్యం, సామర్ధ్యం సార్ధకం కావడమే కాక, అతని ప్రతిష్ట కూడా పెరుగుతుంది, గౌరవం పెరుగుతుంది. ఒక్కొక్క సమయంలో "మనకు కల ఈ అతిశయానికి, గొప్పతనానికి ఇటువంటి సామాన్యులతో కలసి మెలసి ఉండవలసిన అవసరం, ఆవశ్యకత ఉన్నదా? మనకు ఇది అంతా అవసరమా? అని దోస తోచవచ్చు. కానీ, ఆ విధంగా ఆలోచించకూడదు. ఎవరికీ ఉపయోగపడని ఎవరి సామర్ధ్యమైనా, పాండిత్యం అయినా కాలం గడిచే కొద్దీ అది మసకబారిపోతుంది. తనకు గల గొప్పతనాన్ని పోగొట్టుకుంటుంది. అది నలుగురకు ఉపయోగపడినప్పుడే నిలచి ఉంటుంది, ప్రకాశిస్తుంది. సార్ధకం అవుతుంది. భగవంతుని ఆనందానికి కూడా అది కారణమవుతుంది.

మనం కూడా మనకు భగవంతుడు ఇచ్చిన సామర్థ్యాన్ని ఇతరుల ఉపయోగానికి లక్ష్యం అయ్యేటట్లు ప్రయత్నం చేద్దాం.

# భగవత్కటాక్షమహిమ

" అంగణ్ ఇరండుమ్ కొండు ఎంగళ్ మేల్ నోక్కుదియేల్ ఎంగళ్ మేల్ శావమిழిన్దు" (నీ అందమైన రెండు నేత్రాలతో మాపై నీ కటాక్షాలను ప్రసరింప చేస్తే, మాపై ఉండే శాపం అంతా తీరిపోతుంది) అని అంటూ గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో పలుకుతున్నది. ఈ సూక్తిద్వారా భగవంతుని దివ్యమైన కటాక్షాన్ని పొందాలని ఆమె ప్రార్థిస్తున్నది. " తింగళుమ్ ఆదిత్తియనుమ్ ఎழున్దాఱ్పోల్ అంగణ్ ఇరండుమ్ కొండు ఎంగళ్ మేల్ నోక్కుదియేల్ ఎంగళ్ మేల్ శావమిழిన్దు" (చంద్రుడు, సూర్యుడు ఉదయించినట్లుగా ఉండే. నీ అందమైన రెండు నేత్రాలతో మాపై నీ కటాక్షాలను ప్రసరింప చేస్తే మాకు ఉండే శాపం అంతా తీరిపోతుంది). అని గోదాదేవి పలుకుతున్నది.

భగవంతునకు కల ఒక కన్ను చంద్రునివలె, ఇంకొక నేత్రం సూర్యునివలె ఉన్నదట. ఈ రెండిటికి ఏమి వైలక్షణ్యం ఉన్నది? చంద్రుడు ప్రకాశాన్ని ఇస్తాడు, సూర్యుడు కూడా ప్రకాశాన్ని ఇస్తాడుకదా– అని అంటే, ఈ ఇద్దరి మధ్య తేడా ఉన్నది. చంద్రుని కాంతి శ్రమను పోగొడుతుంది. చల్లదనాన్ని ఇస్తుంది. వేడిమిని తీరుస్తుంది. అయితే, చీకటిని పూర్తిగా పోగొట్టలేదు. సూర్యుని కాంతి వెలుతురును ఇస్తుంది. చీకటిని పోగొడుతుంది. అయితే, శ్రమను పోగొట్టలేదు, చల్లదనాన్ని ఇవ్వలేదు.

ఈ విధంగా చంద్రుని కాంతిలో ఒక గొప్పతనం ఉన్నది. సూర్యునికి కాంతిలో వేరొక గొప్పతనం ఉన్నది. భగవంతుని నేత్రాలు చంద్రునివలె,

సూర్యుని వలె ఉన్నవి కనుక, ఈ రెండు విధాలయిన గొప్పతనాలు భగవంతుని నేత్రాలకు ఉన్నాయి. ఒకేసారి సూర్యునివలె, చంద్రుని వలె ఉండే తన రెండు నేత్రాలతో భగవంతుడు కటాక్షించినట్లయితే, ఒకవైపు మన శ్రమ తీరుతుంది చల్లదనం కలుగుతుంది మరొక వైపు చీకటి తీరిపోతుంది. ఇక్కడ చీకటి అంటే– అజ్ఞానం. ఆత్మ పరమాత్మల జ్ఞానం లేకపోవడం. ఆ అజ్ఞానమనే చీకటిని తీరిపోతుంది. అందుచేతనే భగవంతునకు కల సూర్యుడు, చంద్రుడు ఉదయించినట్లుగా ఉండే అందమైన రెండు నేత్రాలతో కటాక్షించాలని గోదాదేవి కోరింది.

మనం కోవెలకు వెళుతున్నాము. భగవంతుని దర్శిస్తున్నాము. ఆ స్వామి కటాక్షాన్ని పొందాలని అర్థిస్తున్నాము. భగవంతుడు మనలను తన రెండు నేత్రాలతో కటాక్షిస్తున్నాడు అందువల్ల మనకేమి మంచి జరుగుతుంది? అంటే, మనకు చంద్రుడు కలిగించే హితం కలుగుతుంది, సూర్యుడు కలిగించే హితం ఏర్పడుతుంది. శ్రమను తీర్చి, చల్లదనాన్ని ఇవ్వడం అనేది ఒక విషయం. అజ్ఞానమనే చీకటిని పోగొట్టడం వేరొక విషయం ఈ రెండే కదా మనకు ఆవశ్యకాలు. "తింగళుమ్ ఆదిత్తియనుమ్ ఎழுన్దాల్పోల్ అంగణ్ ఇరండుమ్ కొండు ఎంగళ్ మేల్ నోక్కుదియేల్ ఎంగళ్ మేల్ శావమిழிన్దు" అనేది సిద్ధిస్తుంది.

ఇక్కడ శాపం అంటే– దుఃఖం. అనాదికాలంగా మనం అనుభవిస్తున్న కర్మల వల్ల ఏర్పడిన దుఃఖం. మనం పలు జన్మలలో ఎన్నో కర్మలను పేర్చి పెట్టుకున్నాము. వాటి వల్ల మనకు ఏర్పడే దుఃఖం ఇక్కడ శాప శబ్దం చేత చెప్పబడుతున్నది. ఇక్కడ దుఃఖం ఎందుకు శాపశబ్దంచేత

నిర్దేశింపబడుతున్నది? అంటే శాపం అనుభవించి తీరవలసి ఉన్నట్లుగా, ఈ దుఃఖం కూడా అనుభవించి తీరవలసినదే కదా. అందుచేత శాపం అని గోదాదేవి అంటున్నది. శాపం అనేది ఒక ఋషి ఇచ్చేది కదా. ఈ విధంగా, ఇన్ని రోజులు, ఇతడు అనుభవించాలి– అని కదా శాపం ఉంటుంది. శాపం ఇచ్చిన ఋషియే ఆ శాపానికి విమోచనం కూడా చెప్పవలసి ఉంటుంది. ఆ శాపం అనుభవించే కదా తీరిపోవాలి. ఈ దుఃఖాలు కూడా అటువంటివే కనుక శాపాలే. "ఎంగళ్ మేల్ శావమిఴిన్దు". భగవత్ కటాక్షంవల్ల ఈ శాపాలు. అనదగిన దుఃఖాలు తీరిపోతాయి.

ఒక త్రాసులో రెండు తట్టలు. ఆ రెండు తట్టలలోని ఒక తట్టలో మన కర్మలు, ఆ కర్మల వల్ల ఏర్పడే జన్మలు ఉన్నాయి ఇంకొక తట్టలో భగవంతుని కరుణ, ఆ కరుణ వల్ల ఏర్పడే కటాక్షం ఉన్నాయి. ఈ రెండిటిని పోల్చి చూసినట్లయితే, మన కర్మలు మనలను ప్రేరేపించి, ప్రేరేపించి మనకు జన్మలను కలిగిస్తూనే ఉంటాయి. "అయ్యో! ఇతడు ఈ విధంగా కర్మల వల్ల దుఃఖపడుతున్నాడే! జన్మల తరువాత జన్మ లను ఎత్తుతున్నాడే! ", అని భగవంతుడు కరుణతో కూడిన కటాక్షాన్ని మనపై ప్రసరింపజేసి అనుగ్రహిస్తాడు. దానివల్ల మన కర్మలు, జన్మలు, నశించిపోతాయి.

భగవంతుని జాయమానకటాక్షం పడినవాడు చాలా అదృష్టవంతుడు. " జాయమానం హి పురుషం యం పశ్యేత్ మధుసూదనః, సాత్వికః స తు విజ్ఞేయః స వై మోక్షార్థ చింతకః" (జన్మించే ఏ బిడ్డపై భగవంతుడు తన కటాక్షాలను ప్రసరింప చేస్తాడో, అతడు సత్వగుణాన్ని

కలిగినవాడవుతాడు. మోక్షాన్నిగూర్చి, మోక్షపురుషర్థాన్ని గురించి ఆలోచన కలిగినవాడవుతాడు. )

మనం కోవెలలకు విశ్వరూప దర్శనానికి వెడతాము. గురువాయూరు, అనంతపద్మనాభస్వామి ఆలయం మొదలైన ఆలయాలకు ఉదయకాలంలో విశ్వరూప సందర్శనానికి వెళతాము. అప్పుడు ఆ భగవానుని ప్రథమ కటాక్ష వీక్షణాలకు పాత్రులం అవుతున్నాము. గర్భాలయం తలుపులను తెరిచిన వెంటనే భగవంతుని మొట్టమొదటి కటాక్షాలు మనపై పడాలి. మనకు ఉండే శాపం అంతా తీరిపోవాలి– అని కోరుకుంటాము. అటువంటి కటాక్షాన్ని పొందడం ఎందుకోసం? అని ఆలోచిస్తే, మన కర్మలు, దాని వల్ల ఏర్పడే జన్మలు తీరిపోవడం కోసమే కదా. అవి తీరిపోయేటట్లుగా భగవంతుడు కటాక్షిస్తాడు సూర్యునివలె, చంద్రునివలె కటాక్షిస్తాడు. మనకుండే శ్రమ అంతా తీరేటట్లుగా, శాపం అంతా తీరేటట్లుగా, అజ్ఞానం అనే చీకటి పూర్తిగా తొలగిపోయేటట్లుగా అనుగ్రహిస్తాడు. అటువంటి భగవంతుని కటాక్షాలను పొంది, పరమహితాన్ని పొందుదాం. రండి. స్వస్తి.

# జన్మచక్రం

వేదాంతవిషయకాలైన శ్లోకాలలో గాని, పాశురాలలో కానీ, జన్మ మరణాల రూపంలోని ఈ సంసారాన్ని ఒక చక్రంతో, సుడితో పోల్చి చెప్పడం ప్రచురంగా మనకు కనిపిస్తుంది. ఈ సంసారంలో మనం పుట్టి, మరణించి, మళ్ళీ, పుట్టి మరణిస్తున్నందున, మాటిమాటికి ఈ విధంగా ఈ సంసారంలోకి వచ్చి వెళుతున్నందున, ఈ సంసారాన్ని సుడి అని, చక్రమని అనడం మనకు కనబడుతుంది. మనం జన్మిస్తున్నాము, మరణిస్తున్నాము, సరే. మరి, దీనిని చక్రంగా, సుడిగా పోల్చడం ఎందుకు? ఈ సంసారం చక్రంవల, సుడివలె గుండ్రంగా ఉంటుందా ?చుట్టి చుట్టి, తిప్పితిప్పి తిరుగుతుందా?

జన్మ, జన్మ తర్వాత మరణం మరణం తరువాత జన్మ, మళ్ళీ మరణం– అని ఏ విధంగా తిప్పి తిప్పి వస్తున్నందున దీనిని చక్రం అని, సుడి అని అంటున్నారు– అనేది మొట్టమొదటి అర్థ సమన్వయం ఒక ఆత్మ శరీరాన్ని పరిగ్రహిస్తే, అది జన్మ అనబడుతుంది. ఆ శరీరాన్ని విడిచిపెట్టినప్పుడు, అది మరణం అనబడుతుంది. మళ్ళీ, ఆత్మ వేరొక శరీరాన్ని పరిగ్రహిస్తే, అది మళ్ళీ జన్మ. మళ్ళీ, ఆ శరీరాన్ని విడచి పెడితే అది మరణం. ఈ విధంగా ఆత్మకు జన్మమరణాలు అనేవి మాటిమాటికి, తిరిగి తిరిగి ఏర్పడుతున్నాయి. అందువల్ల జన్మచక్రం అని, సుడి అని అంటున్నాము. ఇది మొదటి సమన్వయం.

కానీ ఇంతకంటే ఒక విలక్షణమైన సమన్వయం ఇంకొకటి ఉన్నది. ఆత్మ జన్మిస్తున్నది, మరణిస్తున్నది– అని అంటే, అది చుట్టి చుట్టి వస్తున్నది,

తిరిగి తిరిగి వస్తున్నది –అని అనడానికి లేదు కదా. ఆత్మ పరిభ్రమిస్తూ వస్తున్నదా ఏమి? లేదు కదా. అందుచేత ఇక్కడ చక్రంవలె, సుడివలె పరిభ్రమించడమంటే ఏమి? అనే విషయాన్ని గమనిద్దాం.

లోకంలో, కార్యం, కారణం అనేవి రెండు ఉన్నాయని మనకు తెలుసు. లోకంలో కుండకు మన్ను కారణం, కుండ కార్యం. ముద్దబంగారం కారణం, దానితో నిర్మింపబడిన, నగ కార్యం. దూది కారణం, నూలు గాని, వస్త్రం గాని కార్యం. ఈ సందర్భాలలో అన్నిటిలోనూ కారణం కార్యంగా మారుతుంది.. కార్య వస్తువు నశిస్తే, మళ్లీ అది కారణవస్తువుగానే అవుతున్నది. కుండ పగిలి పోతే ముక్కలై, చూర్ణమై, మళ్ళీ, అది మన్ను అవుతున్నది. ఆ విధంగానే, ముద్ద బంగారంనుండి కార్యరూపాన్ని పొందిన నగను కరిగిస్తే, మళ్ళీ అది ముద్ద బంగారం అవుతున్నది. ఆ విధంగా కార్య కారణాలు రెండు తిరిగి వస్తున్నాయి. కనుక చక్రం, సుడి అనబడుతున్నది– అని ఇక్కడ చెప్పవచ్చు. మొదట మన్నుగా ఉన్నది. ఆ మన్నే కుండగా మారింది., ఆ కుండే మళ్ళీ మన్నుగా అయినది. మళ్లీ ఈ మన్ను కుండగా మారుతుంది. ఈ విధంగా ఇక్కడ కార్యకారణ రూపంలో ఉండే చక్రం. సుడి ఏర్పడుతున్నాయి.

. మనం ఎత్తిన జన్మను కార్యమని అనుకోండి. దీనికి ఈ జన్మకు ఏమి కారణం? కర్మకదా. చిరకాలంగా మనం చేర్చి పెట్టుకున్న కర్మ అది పాపం కావచ్చు, పుణ్యం కావచ్చు ఆ కర్మయే జన్మకు కారణం అవుతుంది. ఈ విధంగా కర్మజన్మల చక్రం, సుడి తిరుగుతున్నది. కర్మల కారణంగా మనం జన్మలను పొందుతున్నామనుకోండి. సరే, అప్పుడు కర్మలు

పూర్తిగా తీరిపోతాయా? తీరిపోవడం లేదే. ఆ జన్మలో మళ్లీ మనం కొన్ని కర్మలను చేస్తున్నాము. అందువల్ల, కర్మల ఫలంగా జన్మను పొందడంతో ఆగడం లేదు. మళ్లీ జన్మలలో కర్మలను చేసి చేర్చి పెట్టుకుంటున్నాము. అందుచేత, జన్మ మళ్ళీ కర్మలకు కారణం అవుతున్నది. జన్మ కర్మలకు కారణమవుతున్నది– అనే విధంగా ఇక్కడ మళ్ళీ జన్మ కర్మల సుడి తిరుగుతున్నది. అంతటితో ఆగుతున్నదా? ఆగడం లేదు. మళ్లీ ఆ కర్మలను తీర్చుకోవడం కోసం జన్మలను ఎత్తుతున్నాం. అందుచేత, కర్మలు మళ్లీ జన్మకు కారణం అవుతున్నవి. మళ్లీ, ఆ జన్మలలో మరికొన్ని కర్మలు చేస్తున్నాము. కనుక, జన్మలు కర్మలకు కారణం అవుతున్నవి. ఈ విధంగా జన్మకర్మల కార్యకారణభావం, కారణ కార్య భావం నిరంతరంగా అనువర్తిస్తున్నవి. సుడి తిరిగినట్టు, చక్రం పరిభ్రమించినట్లు కార్య కారణాల చక్రం, సుడి తిరుగుతున్నవి. అందుచేత కూడా జన్మచక్రం అని, సుడి అని చెప్పవచ్చు –అనేది వేరొక సమన్వయం..

ఇక్కడ, ఇంకొక కోణంలో కూడా చూద్దాం. జన్మయే కదా కార్యం. ఈ జన్మయే కర్మకు కారణం అవుతున్నది. జన్మలను ఎత్తినందువల్లనే కర్మలను చేర్చి పెట్టుకుంటున్నాము. ఈ దృష్టిలో చూసినప్పుడు, కర్మలే కార్యాలు అవుతున్నాయి జన్మలు కారణాలు అవుతున్నాయి. ఇది ఒక సుడి, ఇది ఒక చక్రం. మొదట కర్మ కారణమై, జన్మ కార్యమై ఉన్నది. మళ్లీ, ఆ జన్మయే కారణమై, కర్మ కార్యమైనది. ఈ విధంగా కార్యమే కారణమై, కారణమే కార్యమౌతున్నది. ఈ విధంగా కార్య కారణాలు మారి

మారి ఏర్పడుతున్నందున, సుడిగా, చక్రంగా అవుతున్నది. ఈ విధంగా జన్మకర్మల చక్రం తిరుగుతున్నది కార్యకారణాలు మారి మారి ఏర్పడుతున్నాయి.

ఇటువంటి కార్య కారణాల, కారణ కార్యాల రూపంలో ఉండే మన జన్మ కర్మల సుడి, చక్రం నిలిచిపోవాలంటే, మనం "భగవంతుడైన శ్రీమన్నారాయణుని శ్రీచరణాలే శరణం" అని దృఢంగా నమ్మి, వాటిని ఆశ్రయించాలి. ఆశ్రయిద్దాం రండి. స్వస్తి.

సాంప్రదాయిక వ్యాస మాలిక–14

## శ్రీకృష్ణావతారం అర్ధరాత్రి ఎందుకు జరిగింది?

శ్రీచిన్న జీయర్ స్వామి వారి సూక్తి

మానవ హృదయంలో పేరుకుని ఉండేటటువంటి అహంకారానికి మూలమైనటువంటి రజోగుణం, దాని యొక్క వికారాలన్నిటితోటి అది భగవంతుని ఇందులో కప్పిపెడితే, అందులోంచి ఆయన బయటకు వచ్చి, జ్ఞానులైన మహానుభావులైననటువంటి పెద్దల ద్వారా ఇందులో ఉండే ఒక్కొక్క ఒక్కొక్క లోపాన్ని తొలగించి, తిరిగి, ఈ అహంకారాన్ని కూడా నిర్మూలన చేసి, ఇందులో సాత్విక ప్రవృత్తికి పట్టాభిషేకం చేస్తాడు సుమా! ఆ రకంగా, ఈ మధుర నగరాన్ని భగవంతుణ్ణి కలిగిన నగరంగా, భగవంతుడికి చెందిన నగరంగా, తీర్చి దిద్దడం ఆయన అవతారానికి ప్రధానమైనటువంటి ప్రయోజనమని మనకి ఆయన అర్ధరాత్రి అవతరించాడండి. మొత్తానికి, రాముడు, కృష్ణుడు. ఒకరు ఆచరణకి, ఒకరు దానిని తెలుసుకోవడానికి వీలైనటువంటి జ్ఞానాన్ని అందించడానికి.

# నచికేతోపాఖ్యానమ్

మహర్షి ఉద్దాలకుడు గొప్ప తపస్వి. అతని భార్య విశ్వబల. ఈ పుణ్య దంపతులు అనేక యజ్ఞయాగాలు చేసి, సుప్రసిద్ధులైనారు. ఉద్దాలకుడు దానధర్మాలు చేసే స్వభావం కలవాడు. వచ్చినవారందరికీ ఎప్పుడూ అన్నదానాన్ని చేయడం వల్ల అతనికి వాజశ్రవసుడు అనే పేరు వచ్చింది. వాజశ్రవసుడు చాలా గొప్పవాడు. కానీ, అతడు ఒక దోషం ఉండేది. ప్రతి చిన్న విషయానికి వెంటనే కోపం తెచ్చుకోవటం. అతడి ఆవేశానికి హద్దులు ఉండేవి కావు. మళ్లీ కొంతసేపు ఆగితే, ఆ కోపం అంత ఎటుపోయేదో! చక్కగా గౌరవంతో ఆదరించేవాడు. అతని భార్య విశ్వబల ఇందుకు పూర్తిగా విరుద్ధం. ఆమె గొప్ప జ్ఞాని. శాంతస్వభావురాలు. భర్తను దైవంగా భావించేది. కానీ, ఆమెకు సంతానం లేకపోవడం ఎంతో కొరతగా ఉండేది. ఆమెలో గల అసంతృప్తి గ్రహించిన వాజశ్రవసుడు "విశ్వబలా! ఎందుకు బాధపడతావు? నీకు సంతానం కలగలేదని ఎవరు చెప్పారు? మనం ఒక యాగం చేద్దాం. అన్ని విధాల యోగ్యుడైన పుత్రుడిని దేవతలు మనకు ఇస్తారు. నువ్వేమీ దిగులు పడకు" అన్నాడు వారిద్దరూ కలిసి శ్రద్ధగా ఒక యాగం చేశారు. ఆ యాగఫలంగా వారికి ఒక మగ బిడ్డ కలిగాడు. అతనికి వారు అల్లారు ముద్దుగా నచికేతుడు అనే నామకరణం చేశారు. బాలుడు గొప్ప తేజస్వి. జిజ్ఞాసాపరుడు. బాల్యంలోనే అతడికి అనేక సందేహాలు ఏర్పడుతూ ఉండేవి. వాటికి సరిగ్గా సమాధానాలు చెప్పగలిగేవారు ఉండేవారు కారు. నచికేతుడు ఉదయం లేచి స్నానం చేసి, ఆశ్రమవాటికలోనే రంగురంగుల పూలు కోసుకొచ్చి

తల్లికి ఇచ్చేవాడు. తర్వాత, తల్లితోపాటు గోశాలకు వెళ్లి గోపూజలో పాల్గొనేవాడు. ఆవులతో, దూడలతో ఆడేవాడు. అలా అలా పెరిగి పెద్దవాడైన నచికేతునకు ఉపనయనం చేసి విద్యాభ్యాసంకోసం గురుకులంలో చేర్చాడు, వాజశ్రవసువు.

కొద్ది రోజుల తరువాత, వాజశ్రవసువు విశ్వజిద్యాగాన్ని ప్రారంభించాడు. ఈ యాగం చేసే వ్యక్తి తన వద్ద ఏమీ మిగిల్చుకోకుండా తనకున్న సర్వస్వం అందరికీ దానం చేసేయాలి. దాదాపు యాగం పూర్తయింది. దానం చేసే కార్యక్రమం మొదలయ్యింది. వాజశ్రవసువు నీరు తాగడానికి, పాలు ఇవ్వడానికి శక్తి లేని, ఉపయోగం లేని గోవులను యాగం చేసిన ఋత్వికులకు దానంగా ఇవ్వదలచాడు. ఇదంతా గమనించాడు, నచికేతుడు, తన తండ్రి స్వర్గం పొందాలనే కోరికతో ఎందుకు పనికిరాని గోవులను దానం చేయటం నచికేతుడికి ఆశ్చర్యాన్ని కలిగించింది. అప్పుడు నచికేతుడు తండ్రి వద్దకు వెళ్లి, " తండ్రీ! మీరు చేస్తున్న యాగంలో మీకున్న సర్వసంపదలు దానం చేయాలి కదా. నేను కూడా మీకు ఉన్న సంపదంలో ఒకరిని కదా. మరి నన్ను ఎవరికి దానం చేస్తారు?" అని తండ్రిని ప్రశ్నించాడు. దానికి వెంటనే వాజశ్రవసుడు నచికేతుడికి సమాధానం చెప్పలేదు. కానీ, నచికేతుడు అలాగే తిరిగి మరో రెండు మూడు సార్లు అలాగే ప్రశ్నించాడు. దానితో విసిగిపోయిన తండ్రి అయిన వాజశ్రవసువు నచికేతుని వైపు కోపంగా చూస్తూ, "నిన్ను ఆ యముడికి దానం చేస్తాను" అన్నాడు. దానికి నచికేతుడు తండ్రి మాటలకు ఎంతో ఆశ్చర్యపడి, "నా తండ్రికి ఉన్న కొడుకులలో శిష్యులలో

నేను శ్రేష్ఠుడిని కాకపోయినా, ఎందుకు పనికిరానివాడినైతే మాత్రం కాను. ఆయన నన్ను యమునికి దానం చేస్తాననడం కేవలం కోపం వల్లనే. అయినా, యమునికి నా వల్ల ప్రయోజనం ఏమిటి? ప్రయోజనం ఉన్నా లేకపోయినా, తండ్రి అన్న మాట ప్రకారం యముని దగ్గరికి వెళ్లి తీరాలి" అని నిశ్చయించుకున్నాడు. అనుకున్నదే తడవుగా వెంటనే యముని దగ్గరకు దగ్గరకు ప్రయాణం అయ్యాడు.

కానీ, యముడు ఆ సమయంలో బ్రహ్మదర్శనానికి వెళ్ళాడు. నచికేతుడు యముని ఇంటికి వెళ్లాడు. కానీ, యముడు ఆ సమయంలో బ్రహ్మ దర్శనం కోసం వెళ్ళాడు. నచికేతుడు యముడి కోసం ఎదురుచూస్తూ, ఆయన గృహంలో యమధర్మరాజు వచ్చేవరకు ఉపవాస దీక్షతో ఎదురుచూడసాగాడు. మూడు రోజుల తర్వాత యముడు తిరిగి వచ్చాడు. యమకింకరులు బ్రహ్మ తేజస్సుతో ప్రకాశిస్తున్న నచికేతుని గురించి యముడికి చెప్పారు. వెంటనే యముడు నచికేతుని దగ్గరకు వచ్చి, "ఓ బ్రాహ్మణకుమారా! నీకు నా నమస్కారం. నీవు పూజింపదగిన అతిథివి. నీవు మూడు రాత్రులు నా ఇంట్లో ఉపవాసం చేసినందుకు నీకు మూడు వరాలు ఇస్తాను, కోరుకో" అన్నాడు.

దానికి నచికేతుడు యుమధర్మరాజుకు నమస్కరించి, " సరే అలాగే"నని, మొదటి వరంగా "నేను ఇక్కడ నుండి ఇంటికి తిరిగి వెళ్ళగానే మా తండ్రిగారికి నాపై కోపం పోయి, నన్ను ప్రేమతో పలకరించి దగ్గరకు తీసుకోవాలి" అన్నాడు. అప్పుడు యముడు నచికేతునితో " నీవు ఇంటికి వెళ్ళగానే, మీ నాన్న కోపం అంతా పోయి, నిన్ను ప్రేమతో

పలకరించి దగ్గరకు చేర దీస్తాడు. నిన్ను చూసిన వెంటనే ఆయన హృదయం ఆనందంతో ఉప్పొంగిపోతుంది "అని మొదటి వరాన్ని ప్రసాదించాడు.

ఆ తర్వాత నచికేతుడు యమధర్మరాజుని రెండవ వరంగా "స్వర్గలోకంలో మృత్యువును గురించిన భయం లేదని విన్నాను. అక్కడ మృత్యువు రాదు. ముసలితనము భయపెట్టదు. ఆకలి, దప్పికలు అస్సలు దగ్గరకు రావు. దుఃఖం అనేది ఉండదు. అదే స్వర్గ సుఖం. అటువంటి స్వర్గప్రాప్తి పొందే మార్గం అగ్నివిజ్ఞానం. అది నీకు తెలుసు. నాకు ఆ స్వర్గసాధకమైన అగ్నివిజ్ఞానాన్ని ఉపదేశించు" అని అడిగాడు. దానికి యముడు సరేనన్నాడు. నచికేతునికి అగ్ని విజ్ఞానం సమస్తం ఉపదేశించాడు. నచికేతుడు ఆ ఉపదేశాన్ని పూర్తిగా గ్రహించాడు. తనకు అగ్నివిజ్ఞానం బాగా తెలిసిందని నిశ్చయించుకోవడానికి తాను నేర్చుకున్న అగ్నివిజ్ఞానమంతా యముడికి తిరిగి అప్ప చెప్పాడు. యముడు అతని మేధాశక్తికి మెచ్చి, అతని పేరుతో ఆ అగ్ని నచికేతాగ్నిగా లోకంలో ప్రసిద్ధిచెందుగాక! అని ఆశీర్వదిస్తూ, నీ పేరున ప్రసిద్ధిగాంచిన ఈ క్రతువిజ్ఞానాన్ని తెలుసుకొనినవాడు ఈ కతుమంత్రాలు మూడుసార్లు అధ్యయనం చేసినవాడు అ జన్మ కర్మల అనుష్ఠానంతో వైరాజ్య పదవిని పొందుతాడు. ఈ నచికేతాగ్నిని చయనం చేసినవారికి అధర్మం అంటదు. రాగద్వేషాలు దగ్గరకు రావు. అలాంటివాడు స్వర్గంలో సంతోషంగా ఉంటాడు " అని నచికేతునకు రెండు వరాలను ప్రసాదించాడు. నచికేతునికి రెండు వారాలు లభించాయి.

కానీ ఈ రెండు వారాలు నచికేతుని ఆధ్యాత్మిక జిజ్ఞాసను తీర్చి తృప్తి పరచలేకపోయాయి. దానితో నచికేతుడు మూడవ వరంగా "ఓ యమధర్మ రాజా! పుట్టిన ప్రతి మానవునికి మరణం సహజం. మానవుడు మరణించినప్పుడు తోటి మానవునికి ఈ సందేహాలు వస్తాయి. చనిపోయిన తర్వాత మనిషి ఏమవుతాడు? మనిషి శరీరంలో ఆత్మ ఉందని, ఆ ఆత్మ మనిషి చనిపోయిన తర్వాత కూడా ఉంటుందని వాదిస్తున్నారు. ఈ విషయంలో నాకు సత్యాన్ని చెప్పండి " అని నచికేతుడు యముని మూడవ వరంగా కోరాడు. ఆత్మ తత్వాన్ని తెలుసుకోవడానికి అందరికీ అర్హత ఉండదు. కనుక, నచికేతుని అర్హతను యముడు పరీక్షింప దలిచాడు. "ఓ నచికేతా! ఆత్మతత్వాన్ని గురించి దేవతలకు కూడా సంశయమే ఉంటుంది. ఆ ఆత్మ విషయం అతి సూక్ష్మమైనది. సామాన్య జనుల జ్ఞానానికి అందని విషయం, అది. కనుక, నచికేతా! ఈ వరం తప్ప, లోకంలో ఎవరికీ లభించని సకల భోగాలను నీకు వరంగా ఇస్తాను. కోరుకో. ఇంక ఏదైనా ఇస్తాను కోరుకో ఇస్తాను. కానీ ఈ మరణ సంబంధమైన ప్రశ్న మళ్లీ అడగవద్దు" అని అనేక విధాలుగా వారించాడు. యముని మాటలు నచికేతుని అచంచల హృదయాన్ని కదిలించలేకపోయాయి. యమునితో నచికేతుడు "యమధర్మ రాజా! నీవు చెప్పిన భోగాలన్నీ అశాశ్వతాలు. శాశ్వతంగా ఉండవు. ఇవన్నీ నాకు అవసరం లేదు. వివేకజ్ఞానం కలవాడు ఎవ్వడూ క్షణికమైన భోగాలను కోరడు. " అన్నాడు యముడు నచికేతుని పట్టుదలను మెచ్చి, ఆత్మతత్వాన్ని ఇలా ఉపదేశించాడు.

"నచికేతా! మనిషి అనుసరించడానికి రెండు మార్గాలు ఉన్నాయి. మొదటిది శ్రేయోమార్గం. శ్రేయో మార్గం అంటే– సత్యం. శాశ్వతమైన సుఖం కలిగే మార్గం. ఇది విద్య వల్ల కలుగుతుంది. మొదట కష్టం అనిపించినా, చివరకు శాశ్వతమైన సుఖం లభిస్తుంది. పండితులు ఈ మార్గాన్నే అనుసరిస్తారు. ఇక, రెండవది ప్రేయోమార్గం. ప్రేయోమార్గం అంటే– తాత్కాలిక సుఖం కలిగించేది. ఇది మొదట సుఖం కలిగించినప్పటికీ, చివరకు కష్టమనుభవించక తప్పదు. ఈ మార్గాన్ని పండితులు ఎన్నటికీ అనుసరించరు. ఈ రెండు మార్గాలు ఒకదానితో ఒకటి మానవుని సమీపిస్తాయి. పండితుడైనవాడు ఈ రెండిటిని బాగా విచారించి, శ్రేయో మార్గమే అవలంబిస్తాడు. నీవు స్త్రీపుత్ర ధన భూభాగాలను శాశ్వతమైనవి కావని ఆలోచించి, త్యాగం చేశావు. ఈ లోకంలో మానవులు అందరూ ఆశపడే ధనాన్ని నీవు ఆశించలేదు. విద్యావిద్యలు చీకటి వెలుగుల లాగా భిన్న ధ్రువాలు కలిగినవే గాక, భిన్న ఫలాలను ఇచ్చేవిగా తెలుసుకో. ఆ రెంటిలోనూ. నిన్ను విద్యను కోరుకున్నవానిగా అనుకుంటున్నాను. ఎందుకంటే, కామభోగాలు నిన్ను ఆకర్షింప లేకపోయాయి. అజ్ఞానం కలవాళ్ళు మాత్రమే తామే గొప్పవాళ్ళమని, శాస్త్రాన్ని తెలిసిన వాళ్ళమని అనుకుంటారు. అలాంటి మూర్ఖులు ఒక గుడ్డివానివెంట వెళ్లే ఇతర గుడ్డివాడిలాగా జనన మరణ వ్యాధి దుఖాలతో కూడిన చెడు మార్గాన్ని అనుసరిస్తారు. చాలామంది మానవులకు ఆత్మవిద్య తెలుసుకోవడానికి అవకాశం లభించదు. విన్నవారు అందరూ ఆత్మతత్వాన్ని గ్రహించలేరు. ఆత్మవిద్య బోధించడం

అందరికీ సాధ్యం కాదు. ఈ ఆత్మ విద్యను గురించి సామాన్యుడైన మానవునికి చెప్పినా అర్థం కాదు. బ్రహ్మ జ్ఞాని అయిన ఉత్తమ గురువు దగ్గర ఉపదేశం పొందితే, ఎలాంటి సందేహమూ ఉండదు.

ఆత్మ ఉందని, లేదని అనేక విధాలుగా పండితులు వాదిస్తుంటారు. ఆత్మను గురించి ఉత్తమ గురువే ఉపదేశించాలి. ఆత్మస్వరూపం ఊహకందని విషయం. ఆత్మ, అణువు కంటే మిక్కిలి సూక్ష్మమైనది. నీవు మంచి పట్టుదల కలవాడివి. నీలాగా మంచి విషయాలలో ఆసక్తి కల విద్యార్థులు మాకు మళ్ళీ మళ్ళీ లభించాలి. నేను కర్మఫలం అనిత్యం తెలుసుకున్నాను. అనిత్యాలైన కర్మ రూప సాధనల ద్వారా నిత్యమైన పరమాత్మ అనే పదార్థం తెలిసికోవాలంటే సాధ్యం కాదు. నేను ఏ అగ్నిదేవునికి నీ పేరు పెట్టానో, ఆ నచికేతాగ్నిహోత్రాన్ని ఎంతో కాలం చేశాను. అనిత్యమైన అకర్మవల్లనే ఈ యమ పదవిని పొందాను. ఓ నచికేతా! నీవు ఈ లోక స్థితిని తెలుసుకొని, ఈ ఐశ్వర్యాలు, భోగభాగ్యాలు, కోరికలు, ఇవన్నీ స్వర్గఫలాన్ని ఇచ్చే యాగాలే, ఇవన్నీ ప్రయోజనాలు లేనివని తెలుసుకొని, వాటిని ధైర్యంగా వదిలేశావు. నీవు సర్వ శ్రేష్ఠుడవైన ధీరుడువి. ఆత్మ అతి సూక్ష్మమైనది కావడం వల్ల, మన కళ్ళతో చూడడానికి వీలు కానిది. అది ప్రాచీనమైనది. హృదయమనే గుహలో ఉంటుంది. అలాంటి విశిష్ట గుణాలు గల ఆత్మను గురించి తెలుసుకోవాలంటే, మనస్సును ఇతర విషయాల నుండి మరల్చి, ఆత్మలోనే ఉండేటట్లుగా గట్టి ప్రయత్నం చేయాలి. ఆత్మ యోగబలం చేత ధీరుడైనవాడు ఆత్మ తత్వాన్ని గ్రహించి సుఖదుఃఖాలను వదిలిపెట్టాలి.

ఆత్మతత్వాన్ని బాగా గుర్తించిన మానవుడు చక్కగా గ్రహించి, ఆత్మను శరీరం నుంచి వేరు చేసి, సూక్ష్మమైన ఆత్మను తెలుసుకోగలుగుతాడు. పండితుడైన మానవుడు గొప్ప ఆత్మను పొంది, మిక్కిలి ఆనందిస్తాడు" అన్నాడు, యమధర్మరాజు.

దానికి నచికేతుడు "ఓ యమధర్మ రాజా! నేను యోగ్యుడనని నీవు అనుకుంటే, ధర్మాధర్మాల కంటే, ప్రపంచం కంటే, భూత భవిష్యద్వర్తమాన కాలాల కంటే భిన్నంగా నీవు దేనిని చూస్తున్నావో, దాన్ని నాకు ఉపదేశించు" అని యమధర్మరాజును నచికేతుడు అభ్యర్థించాడు.

అప్పుడు యముడు నచికేతునితో "నచికేతా! దీనిని పొందాలని ఎందరో కఠినమైన తపస్సు చేస్తారు. ఏది సర్వవేదసారభూతమైందో, అదే ఓంకారం. ఆ ఓంకారమే పరబ్రహ్మ స్వరూపం. ఓంకారం నాశనం లేనిది. ఓంకారాన్ని తెలుసుకున్నవారికి ఏది కోరితే అది లభిస్తుంది. బ్రహ్మ ప్రాప్తికి మూలభూతమైంది, ఓంకారం. దీన్ని తెలుసుకున్నవాడు బ్రహ్మలోకంలో బ్రహ్మలాగా ప్రకాశిస్తాడు. ఆత్మకు మరణం లేదు. ఆత్మ పుట్టదు. మరణించదు. ఆత్మ శాశ్వతమైనది. శరీరం నశించిపోయినా, ఆత్మ నశించదు. ఆత్మ అణువు కంటే సూక్ష్మమైనది. నిష్కామ కర్మ చేసేవాడు మనస్సు, బాహ్యేంద్రియాలయ నియంత్రణ వల్ల ఆత్మ మహిమను గ్రహిస్తాడు. అప్పుడు అతనికి శోకం అనేది ఉండదు. ఆత్మ దేనిని చంపదు, దీని చేత చంపబడదు. ఆత్మ జీవుని హృదయంలో ఉంటుంది. వేదాలు చదవటం వల్ల పరమాత్మ ఎవరికి లభించదు. కేవలం పాండిత్యం ద్వారా ఆత్మరూపం తెలియడం కష్టం. మరి, పరమాత్మను ఎలా

తెలుసుకోవాలి? కేవలం ఆయన పైనున్న భక్తిద్వారానే తెలుసుకోవాలి. మోక్షం పొందాలంటే, మానవుడు సత్కర్మలను ఆచరించాలి. ఇంద్రియాలను జయించాలి. మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి. దృష్టి దేని మీద ఉండకూడదు. ఈ లక్షణాలున్నవాడు మోక్షాన్ని తప్పకుండా పొందగలుగుతాడు. ప్రతి మానవుడి హృదయంలో ఛాయాతపాలలాగా భిన్న లక్షణాలు గల రెండు తత్వాలు కర్మఫలాన్ని అనుభవిస్తున్నాయని పండితులు చెబుతారు. ఛాయ అంటే నీడ, ఆతపం అంటే ప్రకాశం. అంధకారంలో ప్రకాశం ఉండదు ఛాయలో ప్రకాశం ఉంటుంది. కానీ, సంపూర్ణంగా ఉండదు. ఛాయ ప్రకాశం ద్వారానే ఏర్పడుతుంది. సూర్యకాంతి లేకపోయినా ఛాయ ఉండదు. ఛాయ అనగా జీవాత్మ. పరమాత్మ స్వయం ప్రకాశం. జీవాత్మ పరవమాత్మ వల్లనే ఏర్పడుతుంది. వివేకులైనవారు ఇంద్రియాలు అశ్వాల వంటివి అని చెబుతారు. శరీరేంద్రియ మనో యుక్తమైన ఆత్మను భోక్త అంటారు.

మనసుతో కూడిన ఆత్మ నేత్రముల ద్వారా రూపాన్ని చూస్తుంది. ఇంద్రియ సంబంధం లేనప్పుడు ఆత్మ సుఖదుఃఖాలను అనుభవించదు. ఆత్మ బుద్ధివశంలో లేని ఇంద్రియాల వల్ల ప్రమాదంలో పడుతుంది. ఎవరి మనస్సు బుద్ధిస్వాధీనంలో ఉండి, విజ్ఞానవంతమై ఉంటుందో, వారి ఇంద్రియాలు బుద్ధికి స్వాధీనమై ఉంటాయి. ఏ మానవుడు విజ్ఞానం అనే సారథితో కూడి, మనస్సు అనే కళ్లెం కలవాడై ఉంటాడో, అతడు సంసార సాగరాన్ని దాటి పరమాత్మ పొందుతాడు. ఇంద్రియాల కంటే ఇంద్రియ విషయాలు శ్రేష్ఠాలు. ఆ ఇంద్రియ విషయాల కంటే మనస్సు గొప్పది.

మనసు కంటే బుద్ధి గొప్పది. ఆ బుద్ధి కంటే ఆత్మ గొప్పది. జీవాత్మకంటే కంటే మాయాశక్తి గొప్పది. ఆ మాయకంటే ఆ పరమాత్మ గొప్పవాడు. ఆ పరమేశ్వరుని కంటే గొప్పవాడు లేడు. ఆ పరమాత్మ తత్వమే పరమావధి. అదే సమస్తానికి ఉత్తమ గతి " అని అన్నాడు యమధర్మరాజు.

అప్పుడు నచికేతుడు, " ఆత్మ అందరిలోనూ ఉంటుందా? అది అందరికీ కనపడదా? ఆ విధంగా ఎందుకు జరుగుతుంది?" అని ప్రశ్నించాడు దానికి యమధర్మరాజు "అన్ని ప్రాణులలోనూ ఆత్మ ఉంటుంది. అది మన కంటికి కనిపించదు. అది జ్ఞానవంతుల జ్ఞాననేత్రానికే కనిపిస్తుంది. ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, మనస్తత్వం– వీటిలో ఒకదానికంటే మరొకటి గొప్పది. కావున ఇంద్రియాలు మనసు చేతను, మనస్సు బుద్ధి చేతను, బుద్ధి మహత్తత్త్వం చేతను, మహత్తత్వం ఆత్మ చేతను సాధకుడు నియమించుకోవాలి. ఇది సాధనామార్గం. పరమాత్మ యొక్క యథార్థ స్థితిని గ్రహించిన మానవులు జనన మరణ రహితమైన మోక్షాన్ని పొందుతారు. పరమాత్మ ఇంద్రియాలకు బాహ్యదృష్టినే ప్రసాదించాడు. అందుకే, జీవుడు బాహ్యవిషయాలనే చూడగలుగుతున్నాడు. కానీ, అంతరాత్మను చూడలేకపోతున్నాడు. అమరత్వం పొందాలంటే ఇంద్రియాలను బాహ్య విషయాలనుంచి మరల్చి అత్మను చూడగలగాలి. అల్పులైన మానవులు లౌకిక భోగాలను అనుభవించ గోరి, జనన మరణాలను పొందుతూ, కష్టాలను అనుభవిస్తున్నారు. జ్ఞానవంతులు, విజ్ఞానవంతులు అయిన మానవులు శాశ్వతమైన అమరత్వాన్ని

పొందుగోరి ప్రాపంచిక విషయాలను, సుఖాలను కోరుకోరు. ఆత్మకు తెలియనిది ఏదీ లేదు. పరమాత్మ అంతటా వ్యాపించి ఉంటాడు" అని ఆగాడు.

నచికేతుడు తెలుసుకో గోరిన ఆత్మతత్వం, దేవతలకు కూడా సంశయాస్పదమైన పరమతత్వం ఇదే. యమధర్మరాజు మళ్ళీ ఇలా ఉపదేశించసాగాడు. " ఎవరు ఆత్మ ప్రభావం వల్ల స్వప్నావస్థలో, జాగ్రదవస్థలో కంటికి కనబడే పదార్థాల తత్వాన్ని చక్కగా గ్రహిస్తారో, వారు అంతటా వ్యాపించి ఉన్న పరమాత్మను గ్రహించలేరు. ఏ పరతత్వం ఈ దేహేంద్రియ సమూహంలో ప్రకాశిస్తున్నదో, ఆ పరతత్వమే దేహాదుల కంటే భిన్నమైన ప్రదేశంలో ప్రకాశిస్తున్నది. విజ్ఞాన స్వరూపి, ఆత్మ. ఈ భౌతిక శరీరం ఏకాదశ ద్వారాలు కలది. ఏకాదశద్వారాలంటే– బ్రహ్మరంధ్రం, రెండు కళ్ళు, రెండు చెవులు, రెండు నాసికా రంధ్రాలు, ముఖద్వారం, నాభి, మూత్రద్వారం, మలద్వారం. అలాంటి శరీరాన్ని అధివసించే ఆత్మను ధ్యానించే మానవుడు ఎన్నటికీ దుఃఖించడు. అతడు ఈ శరీరం ఉండగానే కర్మ బంధాల నుంచి విముక్తుడు అవుతాడు.

ఓ నచికేతా! నీకు మరల, సనాతనమైన పరమాత్మ గురించి వివరించి చెబుతాను.. బ్రహ్మ తత్వాన్ని తెలుసుకోకపోవడం వల్ల మరణించిన తర్వాత ఆత్మ ఏమవుతుందో, దాన్ని కూడా నీకు చెబుతాను, విను. లోకంలోని జీవుల్లో కొందరు తమ జ్ఞానకర్మానుసారం ప్రాణరూపం ధరిస్తారు. మరికొన్ని జీవులు వృక్షాలు మొదలైన స్థావరాలుగా జన్మిస్తాయి. ప్రళయ కాలంలో అన్ని జీవులు నశించినప్పుడు అన్ని

లోకాలు నాశనం లేని ఆ పరమాత్మను ఆశ్రయించి ఉన్నాయి. ఎవరు ఆ పరమాత్మను అతిక్రమించలేరు. ఇదే పరాతత్వ స్వరూపం. సూర్యుడు తన కిరణాలతో అశుచి పదార్థాలను తాకినప్పటికీ, ఆ మాలిన్యం అతనికి అంటదు. అలాగే, అన్ని ప్రాణుల్లోనూ ఉన్న ఒకే పరమాత్మ ఆయా జీవులు చేసిన పాపపుణ్యాలను అంటడు. పరమాత్మ ప్రాణులకు అతీతంగా లోపల ఉంటాడు. అన్ని లోకాలను తన వశంలో ఉంచుకొని, ఆ పరమేశ్వరుడు అన్ని ప్రాణంలోనూ అంతర్యామిగా తన రూపాన్ని అనేక విధాలుగా చేస్తాడు. ఏ పండితులు తమ బుద్ధిలో ఆత్మ స్వరూపాన్ని చూస్తారో, వారికి శాశ్వత సుఖం లభిస్తుంది. అలా చూడని వాళ్లకు శాశ్వత సుఖం లభించదు. పరమాత్మ యొక్క ప్రకాశం చేతనే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. ఈ జగత్తు అంతా బ్రహ్మవలన పుట్టి, బ్రహ్మ వలననే ప్రవర్తిస్తున్నది. ఎవరు ఈ తత్వాన్ని గ్రహిస్తారో, వారు అమరులవుతారు. పరమాత్మ వల్లనే అగ్ని దహించడం, సూర్యుడు ప్రకాశించడం జరుగుతున్నాయి. స్థిరమైన ఇంద్రియ నిగ్రహాన్ని యోగం అంటారు. యోగం సృష్టినాశక రూపమైనది. యోగ స్థితిలో ఉన్న సాధకుడు ప్రమాదాన్ని పొందడు. పరమాత్మ వాక్కు చేత, మనసు చేత, నేత్రం చేత లభ్యమయ్యేది కాదు. ఆత్మ ఉందని నమ్మినవారికి ఎప్పుడో ఒకప్పుడు దాని సాక్షాత్కారం లభిస్తుంది. కానీ, నాస్తికులకు ఎప్పటికీ పరమాత్మ లభించడు. మానవుని హృదయంలో కోరికలు ఎప్పుడు నశిస్తాయో, అప్పుడే మానవుడు అమరుడు అవుతాడు. అంతటా వ్యాపించి ఉన్న ఆత్మను మాటలతో చెప్పడం కష్టం. ఆత్మకు ఆది,

మధ్యం, అంతం లేదు. అది తుది లేనిది. సూక్ష్మాణువు కంటే సూక్ష్మమైనది. అది అంతు లేనిది. అఖండమైనది. నచికేతా! కోరికలను అన్నింటిని పొందు. పరమ సత్యాన్ని అనుభవించు. ఈ ఆత్మతత్వాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టమైన విషయం. ఇది తెలుసుకున్నవారికి విజయం లభిస్తుంది. పరమాత్మయే సమస్తానికి అధిష్ఠానం. మానవుడు అనేకమైన పనులు చేపడతాడు. ఆ పనుల వల్ల అతనికి ఆనందం లభిస్తుందనే భావంతో ఆ పనులకు పూనుకుంటాడు. ఆనందం దొరకదు అంటే, ఏ మనిషి ఏ పని చేయడు. ఈ జగత్తులో ఏదీ పరిపూర్ణమైన ఆనందాన్ని ఇవ్వలేదు. ఆత్మ తత్వమే పరిపూర్ణానందాన్ని ప్రసాదించగలదు. ఈ ఆత్మ సర్వవ్యాపకం. ఊర్ధ్వలోకాలలో, అధో లోకాల్లో అన్నిటా అదే ఉంది. ఇట్టి ఆత్మానుభూతి మనసు పవిత్రమై పరిశుభ్రమైనప్పుడు మాత్రమే కలుగుతుంది. పవిత్రము, పరిశుభ్రము అయిన మనస్సు కలవానికి ఆత్మసాక్షాత్కారమవుతుంది" అని యమధర్మరాజు చేసిన దివ్యోపదేశంతో నచికేతుడు ఈ ఆత్మవిద్యను సంపూర్ణంగా తెలుసుకొని ఆనందాన్ని పొందాడు.

ఇలా నచికేతుడు ఆత్మతత్వం గురించి యముడి దగ్గర ఉపదేశం పొంది, భూలోకానికి తిరిగి వచ్చాడు. యమధర్మరాజు చేసిన ఈ దివ్యోపదేశం ప్రపంచమంతా వినబడింది. భారతదేశంలోని అన్ని ఆశ్రమవాటికల్లోనూ ఆ ఉపదేశం ప్రతిధ్వనించింది. వాజశ్రవసుని ఆశ్రమంలోనూ అది అందరికీ వినపడింది. వాజశ్రవసువు యజ్ఞశాల నుండి వేగంతో బయటకు వచ్చి, ఆశ్రమం వంక చూస్తూ నిలబడ్డాడు. ఆకాశం నుంచి ఏదో అద్భుతమైన

తేజః పుంజం భూమి మీదకు దిగటం గమనించాడు. అది నెమ్మదిగా ఆశ్రమంలోకి దిగింది. మహాశ్చర్యం! అతను ఎవరో కాదు. నచికేతుడు. ఆశ్రమ వాసుల ఆశ్చర్యానికి అంతు లేదు. వాయశ్రవసుడైన ఉద్దాలకుడు తన కుమారుని గొప్పదనానికి లోలోపల గర్వపడ్డారు. విశ్వబల తన కుమారుని ఈ విధంగా ప్రశ్నించింది. " ఎలా ఉన్నావు నాన్నా! నీకు ఈ తేజస్సు ఎలా వచ్చింది? ఎవరు నీకు నవరత్నాలు బహూకరించారు? అసలు ఎన్ని రోజులు నీవు ఎక్కడున్నావు? ఎలా ఉన్నావు?" అని అడిగింది. దానికి నచికేతుడు తల్లిదండ్రులకు, ఆశ్రమ వాసులకు జరిగిన సంఘటనను చక్కగా వివరించాడు. యముడు చేసిన ఆత్మతత్వోదేశాన్ని సంగ్రహంగా వివరించాడు. అందరూ ఆనందించారు. విశ్వబలను, వాజశ్రవసుని " మీరంతా అదృష్టవంతులు! ఇంత మంచి బిడ్డను కన్న మీరు నిజంగా అభినందనీయులు. ఇతని వల్ల విశ్వజిద్యాగం యొక్క ఫలితం రెట్టింపు అయ్యింది. ఇతనిని మనం గౌరవించాలి. ఎందుకంటే, ఇతని వల్లనే నచికేతాగ్ని ఈ లోకానికి వచ్చింది. ఇతని వల్లనే ఆత్మవిద్య భూలోకానికి వచ్చింది. నచికేతుడు చిన్నవాడైనా, మహర్షి తత్వాన్ని పొందగలిగాడు" అని అభినందించారు. నచికేతుని కథ చక్కగా కఠోపనిషత్తులో బోధింపబడింది. అంత చిన్న వయస్సులో పట్టుదలతో యమలోకానికి పోయి, ఆయన ప్రశంసలను అందుకొని, నచికేతాగ్నిని భూలోకానికి తీసుకుని వచ్చిన ఘనత నచికేతునకే దక్కింది.

సాంప్రదాయిక వ్యాస మాలిక–14

## శ్రీరంగనాథుని తిరుమలవాసం

దక్షిణ భారత దేశంలో ఎన్నో శ్రీవైష్ణవ క్షేత్రాలు ఉన్నా, అందులో శ్రీరంగం చాలా ప్రసిద్ధి చెందింది. శ్రీరంగం శ్రీవైష్ణవ సిద్ధాంతం ప్రచారానికి కేంద్రస్థానం. ఆ తరువాత, కాంచీపురాన్ని చెప్పుకోవచ్చు. ముస్లింల దండయాత్రలు మొదలైన తర్వాత వైష్ణవాలయాల విధ్వంసం, విగ్రహాల నాశనం, బలవంతపు మతమార్పిడి, హిందూ మహిళలపై అత్యాచారాలు ఎక్కువై, హిందువులు ఏమి చేయాలో పాలుపోని పరిస్థితులు ఏర్పడ్డాయి. శ్రీరంగనాథుడే శ్రీరంగం వదలి, తిరుమలకు వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడింది. అది ఎలాగంటే, కాంచీపురం కూడా హిందువులకు, ముఖ్యంగా, వైష్ణవులకు దివ్య క్షేత్రమైనా, అక్కడ పరిస్థితులు కూడా తురుష్కుల తాకిడి వలన సరి అయిన పరిస్థితులలో లేదు. శ్రీరంగనాథుడు శ్రీరంగం వదిలి తిరుపతి ఎలా ఎప్పుడు వచ్చాడో, తిరుమల రంగ మండపంలో ఎంతకాలం ఉన్నాడో, ఆ తరువాత తిరుమల వదిలి మళ్లీ శ్రీరంగం ఎప్పుడు తిరిగి వెళ్ళాడో, తెలియాలంటే శ్రీరంగనాథ దేవాలయ రికార్డును పరిశీలించాలి. అందులో, కోయిల్ ఒళుగు, అంటే, శ్రీరంగాలయ చరిత్ర అని ఒక విధంగా చెప్పుకోవచ్చు. ఆలయంలో ప్రాచీన కాలం నుండి జరుగుతున్న విషయాలన్నీ రాసిపెట్టబడి, భద్రంగా పదిలపరిచిన పత్రాలు కోయిల్ ఒళుకు. వాటి ఆధారంగా మనకు తెలిసిందేమిటంటే, 14వ శతాబ్దంలో, అంటే, 1328వ సంవత్సరం ముస్లింల దండయాత్ర శ్రీరంగంపై జరిగింది. ఆ సమయంలో స్వామివారి సాంవత్సరిక మహోత్సవాలు జరుగుతున్నాయి స్వామివారి విగ్రహాలను ఆ

ఉత్సవాలలో ఆ ఉదయమే కావేరి నదికి తీసుకొని వెళ్లి, పది మధ్యలో ఉంచి, తిరుమంజనాది సేవలను మహాభక్తసమూహం చూస్తూ ఉండగా చేసేవారు. అలా సాయంత్రం వరకు స్వామివారు నది మధ్య ఇసుక పర్రెల మీదనే సేవలు అందుకుని ఊరేగింపుగా ఆలయానికి వెళతారు. ఇట్లా ఉత్సవం జరుగుతున్న సమయంలో, స్వామి వారు కావేరి నదిలో ఉన్నప్పుడే, మహమ్మద్ బీన్ తుగ్లక్ ఆశ్విక సేవలు కన్ననూరు వైపు నుండి కావేరి ఒడ్డుకు చేరుకున్నాయి. సైన్యం వీరి దగ్గరకు వచ్చే లోపల అక్కడ ఉన్న భక్తులు స్వామివారి విగ్రహాన్ని రక్షించాలని నిర్ణయానికి వచ్చి, వారిలో మహాబలిష్ఠుడైన లోకాచార్యులు అనే బలిష్ఠుడైన యువకుడి సారథ్యంలో ఒక బృందాన్ని ఏర్పాటు చేసి, వారికి చిన్న పల్లకి ఇచ్చి, రహదారి గుండా కాక, అడ్డదారుల్లో పుదుక్కోట్టైకు పంపారు. కానీ, లోకాచార్రులు దారిలో, ఎక్కడికి వెళితే మంచిదో ఆలోచించి, తిరుమల మాత్రమే భద్రమైన ప్రదేశంగా నిర్ణయం చేసుకొని, అక్కడి నుండి బయలుదేరాడు. నేరుగా తిరుపతికి వెళ్తే ముస్లింల బారిన పడతామన్న భయంతో, మైసూరు మీదుగా చుట్టూ తిరిగి ముఖ్యమైన రహదారులలో వెళ్లకుండా, అడ్డదారుల్లో ప్రయాణం చేస్తూ, తిరుమలకు చేరుకున్నాడు. ఆ రోజుల్లో, తిరుమల ప్రాంతాన్ని సింగమ నాయకుడు పాలిస్తూ ఉండేవాడు. ఇంకా అప్పటికి అక్కడ ముస్లిం పాలకుల ఛాయలు సోకలేదు. అలా తిరుమలకు చేరిన శ్రీరంగనాథుడు కొండమీద ఆలయ ఆవరణలో, ఆగ్నేయంగా ఉన్న మండపంలో విడిది చేసి, సేవలందుకుంటూ, శ్రీనివాసుని అతిథిగా ఉన్నాడు. అప్పుడు

శ్రీనివాసునికి వైఖానస పూజలు అయితే, శ్రీరంగనాథుడికి పాంచరాత్ర పూజలు జరిగేవి. సాంప్రదాయ పద్ధతిలో శ్రీరంగంలోలాగానే శ్రీరంగనాథునికి వైభవంగా పూజలు జరిగాయట. విగ్రహాలతో వచ్చిన వైష్ణవులే కాక, ఆ వార్త విన్న దక్షిణాది భక్తులందరూ శ్రీనివాసుడిని, శ్రీ రంగనాథుడిని దర్శించడానికి పెద్ద సంఖ్యలో తిరుమలకు రావడం మొదలుపెట్టారు. అదే రోజులలో, హిందూ రాజులు, వారి సామంతులు చేతులు కలిపి, మధుర సుల్తాన్ పై దండెత్తి వారిని ఓడించడం జరిగింది. అప్పుడే, హరిహర బుక్కరాయల నాయకత్వంలో విజయనగర సామ్రాజ్యానికి పునాదులు మొదలయినాయి. సామాన్యశకం 1336వ సంవత్సరంనాటికి ఈ సామ్రాజ్య స్థాపన జరిగినా, వారు నిలదొక్కుకోవడానికి, వారిని ఇతర సామంతులు గుర్తించి ఆమోదించడానికి కొన్ని శతాబ్దాల కాలం పట్టింది. సామాన్యశకం 1370వ సంవత్సరం ప్రాంతానికి తిరుమల తిరుపతి ప్రాంతాలలో విజయనగర సామ్రాజ్యపు ఊడలు బలంగా నాటుకున్నాయి. దక్షిణ భారతదేశమంతా వీరి పరిపాలనలో సుభిక్షం, సురక్షితం అయింది. హిందువులలో ధైర్యం, శాంతిభద్రతలపై నమ్మకం ఏర్పడడంతో, సామాన్య శకం 1371లో, అంటే, 43 సంవత్సరాల తర్వాత, తిరుమలలో నుండి శ్రీరంగానికి శ్రీరంగనాథుని తిరిగి ప్రయాణం వైభవంగా జరిగింది. అంత గొడవల్లో ముస్లింసానికి గురికాని దేవాలయం తిరుమల ఆలయమే.. అంతేకాదు ముస్లింలు కొండ వైపు తల ఎత్తి కూడా చూడలేదు. అలా అన్ని దేవాలయాలు నాశనమైన సమయాన, తిరుమల పై ఆలయానికి ఏమీ జరగకపోవడానికి కారణం,

ఈ స్వామి మహిమే అన్న భావన హిందువులందరిలో కలిగింది. తమిళ ప్రాంతం అంతటినుండి విపరీతంగా యాత్రికులు రావడం, దెబ్బ తిన్నవారి ఆధ్యాత్మిక భావనలకు ఈ తిరుమల ఒక ఆసరాగా నిలవడం జరిగింది. తిరుమల శ్రీవేంకటేశ్వరుని పేరున తిరుమల ఆలయం తరఫున ఆచార్యులు, ఆచార్య పురుషులు గంజాం నుండి తిరుమల వరకు తెలుగుదేశంలో, మైసూరు మంగుళూరు వరకు కన్నడ దేశంలో, శ్రీవైష్ణవ ప్రచారం, ముఖ్యంగా తిరువేంకటనాథుని ప్రచారంగా చేశారు. ఇలా జరుగుతున్న కాలంలోనే, విజయనగర సామ్రాజ్యం వేలు నాటుకొని, తమిళ, కర్ణాటక, తెలుగు రాజ్యాల్లో బలపడటం, వారు ఈ మాధ్యమానికి ఆదరణ చూపించడం జరిగాయి. అలా మొదలైన గ్రామ గ్రామాల్లో తిరుమల వేంకటేశ్వరని ఆలయాలు కట్టించటం, ప్రతిష్ఠలు చేయించటం మొదలయ్యింది. పశ్చిమగోదావరి జిల్లాలోని ద్వారక తిరుమల అలా మొదలైన ఆలయమే. అలాగే, శఠకోప జీయర్వారి తర్వాత, అహోబిల మఠాధిపతుల ప్రోత్సాహంతో వేంకటేశ్వర స్వామి ఆలయాలు, నరసింహస్వామి ఆలయాలు చాలా గ్రామాల్లో కొత్తగా కట్టించారు. సింహాచల వరాహ, నరసింహ మంగళగిరి నరసింహ, అంతర్వేది నరసింహ ఆలయాలు ఈ కోవకు చెందినవే.

సాంప్రదాయిక వ్యాస మాలిక–14

# వీటిని తెలుసుకోకపోతే చాలా నష్టం

శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి ఉపన్యాసం నుండి.

శ్రీరామాయణం ఒక సాగరం. అనంతమైన రత్నాలతో నిండి ఉన్నది. దానిలో ధర్మ ప్రధానంగా, మంత్ర ప్రధానంగా, కావ్య ప్రధానంగా, ఉపనిషత్ ప్రధానంగా ఎన్నో వివరణాలు చేశారు, మన పూర్వులు. వాటిని అన్నిటిని పరిమితమైన కాలం కాదు, జీవితం చాలదు, తెలుసుకోవాలంటే. మన జ్ఞానాన్ని బట్టి దాని లోతు పెరుగుతూ ఉంటుంది. " దానిలో ఇన్ని ఉన్నాయా?" అని కొందరికి సందేహం కలుగుతుంది. మనకు కొందరికి ప్రాణం లేకపోతే, పైపైన చూస్తే, అంతే రమణీయంగా ఉంటుంది. తెలిసిన కొద్ది, లోపలికి దిగిన కొద్ది, దిగిన కొద్ది ఎంతో అగాధమైనది, మన పూర్వీకులు అందరూ ఎంతో ఆదరించినటువంటి మహాగ్రంథం, మన భాగ్యవశంచేత నేటికీ మన మధ్య నిలిచి ఉన్నది, కొన్ని వేల సంవత్సరాల నుంచి నిలచి ఉన్నది. అటువంటి శ్రీరామాయణాన్ని మనం చదవకుండా, దానిలో రహస్యం తెలుసుకోకుండా ఈ జీవితాన్ని చాలిస్తే, " నచేహ చావేదీ మహతీ వినష్టిః" అని అంటుంది బృహదారణ్యకోపనిషత్. ఇహ– ఈ శరీరం ఉండగా, ఉండగా, న చ అవేదీ– తెలుసుకొనక పోకపోతే, మహతీ వినష్టిః– గొప్ప నష్టం అన్నది. మామూలు నష్టం కాదు, చాలా నష్టం. మనకు వేదములు, ఇతిహాసములు పురాణములు అందించిన సకల రహస్యాలని ఏకత్ర నిక్షిప్తం చేసినటువంటిది, శ్రీరామాయణం. మరొక గ్రంథాన్ని చదవక్కర్లేదు. ఇదొక్కటే సమగ్రంగా గాని మనం ఆకలింపు చేసుకుంటే, అంతర బాహ్యా

జీవితాలు రెండు సమగ్రంగా అర్థం చేసుకొని, జీవించగలుగుతాం. అందుచేత శ్రీరామయణాన్ని ప్రధానంగా చదవాలి. ఒకవేళ అంతా చదవలేకపోయినా, సుందరకాండ అయినా చదవాలి.

విష్ణుసహస్రనామం, శ్రీ రామాయణంలో హనుమత్ ప్రధానమైనటువంటి సుందరకాండ, తరువాత భగవద్గీత, ఈ మూడు ప్రతివారు నిత్యము ఎంతో కొంత అధ్యయనం చేయకుండా కానీ జీవితాన్ని గడిపేస్తే, చాలా వ్యర్థమైపోతుంది. వేదమంతా చదవలేం కనుక, మన వారు ", వేదేషు పౌరుషం సూక్తమ్" అన్నారు. పురుష సూక్తమైనా నేర్చుకుని, నిత్యము భగవానుని పురుష సూక్తంతో ఆరాధన, పురుష సూక్తంతో అభిషేకం చేస్తే, మనం వేదమంతా చదివిన ఫలం మనకు సిద్ధిస్తుంది. అలాగే, మంత్రములలో, అన్ని మంత్రములు మనం అనుష్ఠానం చేయనక్కరలేదు, ఒక గాయత్రి మంత్రాన్ని మనం అనుష్టానం చేస్తే, సకల మంత్ర జపఫలం సిద్ధిస్తుంది. అట్లాగానే, మనం ఇతిహాస పురాణములన్ని అధ్యయనం చేయలేకపోయినా, శృతి స్మృతి సారమైనటువంటి ఒక శ్రీరామాయణం చదివితే, మొత్తము సకల వైదిక వాఙ్మయాన్ని అధ్యయనం చేసిన ఫలం సిద్ధిస్తుంది.. గీతా శాస్త్రం చదివితేనే గాని ఎన్ని శాస్త్రములు చదివినా వ్యర్థం అన్నారు. ఇన్నీ చెయ్యలేకపోయినా, అధమం ఏమి చేస్తే, అన్ని ధర్మాలలోకి నీకు ఇష్టమైన ధర్మమేది? అని ధర్మరాజు భీష్మ పితామహుని అడిగితే, "ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః, యద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చేన్నర స్సదా" అని విష్ణు సహస్రనామం చెప్పాడు. లోకములో

మానవుడు తన అభ్యుదయమునకు, తన నిశ్శ్రేసనమునకు తాను ఆచరించవలసినటువంటి సకల ధర్మములోకి ఉత్తమమైన ధర్మము, ఈ స్తోత్రముతో భగవానుని ఆరాధించుట– అని చెప్పి, సహస్రనామం చెప్పాడు. ఈ సహస్రనామం కొన్ని వేలమంది ఋషులు తమ సమాధిలో అనుభవించి దర్శించిన గుణములను, ఆ అనుభవించిన సమయంలో వాగ్రూపంలో బయటకు వినిఃస్మృతమైతే, వర్ణ రూపంలో బహిర్గతమైతే, అవే నామములుగా ఏర్పడ్డాయి. కాబట్టి, ఇవన్నీ "యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మభిః, ఋషిభిః పరిగీతాని". ఇవి ఋషులు చెప్పిన నామాలు. ఎవరో ఒకరు మనకు 11వ రోజు పెట్టిన నామాలు కావు. కల్పితములు కావు. అటువంటి భగవద్గుణములను అనుభవింప చేసేటటువంటి, అనుభూతిని ప్రసాదించేటటువంటి సహస్రనామములను ప్రతివాడు తప్పకుండా నిత్యం చదువుకోవాలి. ఇది మనకు ప్రధాన కర్తవ్యం. సుందరకాండ ప్రతినిత్యం రోజు ఒక సర్గయినా, శక్తి లేదు, పది శ్లోకాలు అయినా, ఏదో కొంత చదువుతూ ఉండడం అలవాటు చేసుకోండి. ఇది సకలారిష్ట నివారకం. సర్వాభ్యుదయప్రదాయకం. అందుచేత సుందరకాండ నిత్య పారాయణగా పెట్టుకుంటే, మనకు ఏ విధమైన అరిష్టములు కానీ, అమంగళములు కానీ దగ్గరకు సోకకుండా మన స్వామి హనుమ కాపాడుతాడు. హనుమ ప్రధానంగా ఉన్న కాండ ఇది. దీనికి సుందరకాండ అని పేరు పెట్టాడు, వాల్మీకి మహర్షి.

# సీత అంటే ఎవరు?

శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామివారి శ్రీ సూక్తి.

"త". ఇది సీతాదేవియొక్క నామంలో ఒక అక్షరం. అటువంటి నామాక్షరమైనటువంటి, బీజాక్షరమైనటువంటి సంపుటితో మొత్తం 68 సర్గలలో, సుమారు 50 సర్గలను, స, త అనే ఈ రెండక్షరాలతోనే వాల్మీకి ప్రారంభిస్తాడు. మీరు గమనించండి. ఈ 50 సర్గల ప్రారంభం స అనే అక్షరంతో కానీ, త అనే అక్షరంతో కానీ అవుతుంది. వాల్మీకి మహర్షి దివ్యడైనటువంటి మహాపురుషుడు కనుక, అతని నోటి నుండి వెలువడినది కనుక, ఈ విధంగా అవతరించింది కానీ, ఇది సామాన్యమైన గ్రంథం కాదు. అందుచేత మనవారంతా సుందరకాండను పారాయణ చేస్తూ ఉంటారు.

మెదటి శ్లోకంలో ఆయన– సాక్షాత్తు భగవానునినుండి మనమందరం కలిసి ఉండి, విడువడకుండా ఉండవలసిన వాళ్ళం మనం అందరం. జీవులందరం. ఎప్పుడూ కలసి ఉండే ఈ జీవతత్వం భగవంతుని నుండి ఎందుకు దూరం అయినది?,

"తతో రావణనీతాయాః"–. " తతః" అంటే– తరువాత అని ఒక అర్థం.. కథ ప్రారంభం చేస్తూ "తరువాత" అనే కథను ప్రారంభం చేస్తారు. ఆ విధంగానే అందంగా కథ ప్రారంభించాడు. ఇది ఒక పద్ధతి. కథ చెప్పే పద్ధతిలో చెబుతాడు? కాదు. ఇది కావ్యం. కావ్యం కనుక ధ్వన్యర్థంలో తతః అంటే– "పరమాత్మ నుండి" అని అర్థం. తత్ అంటే పరమాత్మ అని అర్థం. సంస్కృతంలో, ఉపనిషత్ భాషలో, తత్ అంటే పరమాత్మ. తత్ అని

పరమాత్మకు పేరని ఛాందోగ్యపనిషత్తులో " తదైక్షత, బహుస్యాం ప్రజాయేతి" అని అంటుంది. "తత్ ఐక్షత"– అది సంకల్పించినది. అది అంటే ఏది? సృష్టికి ముందు సకల జగత్తును తనలో చేర్చుకుని, తనకంటే వేరుగా ఉండే రెండవ పదార్థం ఏది లేదు, తాను ఒక్కడే ఉన్నట్లుగా, ఉన్నదని మాత్రమే చెప్పడానికి తగిన స్థితిలో ఉండే సత్ అనే పదార్థమునకు తత్ అని పేరు. తత్ అనే దేనిని అంటారు? దూరముగా ఉండే, కనపడని వస్తువును "తత్" అది అని అంటారు. ఎదురుగా, దగ్గరగా ఉండి కనపడేదానిని ఇది అని అంటారు. సంస్కృతంలో దగ్గరగా ఉండేదానిని "ఇదమ్" అంటారు. దూరంగా ఉండే దానిని తత్ అంటారు. ఈ విధంగా దూరంగా, దగ్గరగా ఉండేవి ఏవి? దగ్గరగా ఉండేది ఇదమ్, ఈ కనపడుతున్న జగత్తు. తత్– అది. కనబడనిది. ఎవరికి, ఎక్కడ, ఎప్పుడు చూడడానికి వీలుకాక, నామరూపములు లేని, ఉన్నదని మాత్రమే చెప్పదగినట్లుగా ఉండది అని తెలుసుకొనేటట్లు ఉండే ఒక పదార్థము సత్. దాని పేరే తత్.

ఈ తత్ అనే దానినుండి విడివడి వచ్చింది తత్వం. ? ఏ తత్వం జీవతత్వం. ఎక్కడికి వచ్చింది? లంకలోకి. ఎవరు తీసుకుని వచ్చారు? "రావణనీతాయాః"– రావణుని చేత తీసుకొని రాబడినది. రావణుడు ఎవరు ? మన లోపల ఉండే మనస్సే రావణుడు. ఈ రావణుని యొక్క ప్రకోపంచేత, మనము అజ్ఞానావృతమైనటువంటి అవిద్య కామ, కర్మ కర్మల చేత బంధింపబడినటువంటి, సంకుచితమైనటువంటి మనఃప్రవృత్తి చేత మనం ఈ సంసార బంధంలోకి వచ్చాము.

అందుచేత, "తతః రావణనీతాయాః, " ఎవరీమె సీత. సీత అంటే ఏమి? భూమిలోనుంచి వెలువడినది. జన్మలేనిది. " న జాయతే న మ్రియతే వా కదాచిత్" అని. కఠోపనిషత్తు చెబుతోంది. పుట్టలేదు, ఆత్మ. చనిపోదు ఆత్మ అగ్ని వేస్తే కాలదు ఆత్మ, గాలికి ఎండదు ఆత్మ. ఇలా చెప్పింది ఇవన్నీ చూపిస్తాడు మనకి. లంకంతా కాలిపోతే, "న చ దగ్ధా". సీతమ్మ కాలిపోలేదు. దహింపబడలేదు. ఎంత ఆశ్చర్యం! ఊరంతా కాలిపోయింది. "చతురంగుల మాత్రోపి నావకాశః స విద్యతే. ". నాలుగు అంగుళాల మేర కూడా కాలని చోటు లేని, కాలని ఊరు లేని చోట, కాలకుండా సీతమ్మ ఉన్నది అంటే, ఎవరా తల్లి? దానికి కారణం ఆమె పాతివ్రత్య మహిమ. భారతీయులమైన మనమంతా బాహ్యముగా తెలుసుకోవలసినది, మన జాతికి నేర్పిన మూల సిద్ధాంతం తల్లి పాతివ్రత్యం. మన దేశాన్ని రక్షించినవారు పతివ్రతలు మన దేశాన్ని రక్షించినవారు మహర్షులు. మన దేశాన్ని రక్షించినటువంటివారు మహాపురుషులు. వారు లేకపోతే మనమీనాటికి, మన భారతదేశం ఈనాటికీ నిలిచి ఉండదు. అటువంటి భారతదేశంలో పతివ్రత అయిన తల్లి, తన పాతివ్రత్యం మహిమ చేత, అగ్నిహోత్రుడు ఆంజనేయుని తోకకు అంటుకుంటే, "అగ్నిదేవా! మా ఆంజనేయుని తోకకు అంటుకోకు. చల్లబడు" అంటే, చందన పంకంవలె చల్లనిది అయిపోయింది, అగ్ని. ఇంత చందనం ముద్ద తోకకు పెట్టారా! అన్నట్లు అయినది. మంట మండుతుంది అగ్ని ఆరిపోయిందేమో! అని అనుకున్నాడు మన హనుమన్న. వెనుకకు తిరిగి చూశాడు. అరెరే! "జ్వలతి! . కరోతి న చ

మే రుజమ్! ". మండుతోంది నాకు బాధ కలిగించలేదు. ఏమి? ఓహో! సముద్రంలో కొండ లేచిందే. అగ్ని చల్లబడదా! మా రాముని అనుగ్రహం, మా సీతమ్మ తల్లి అనుగ్రహం. " అని అన్నాడు, ఆయన. అటువంటి అగ్నిహోత్రాన్ని చల్లార్చగలిగిన శక్తి కలిగినటువంటి తల్లి మన సీతమ్మ. దేని చేత? తన పాతివ్రత్య మహిమ చేత. అంతటి గొప్ప మహిమ కరిగినది కనుక, ఆమె జన్మించలేదు. ఆమె పేరేమి? సీత. సీత అంటే భూమి. దున్నుతుంటే, మన్ను నాగటి చాలు వల్ల ఈ పక్కకు, ఆ పక్కకు వెళుతుంది. ఆ నాగటి చాలునుంచి పుట్టింది సీత నాగటి చాలునుంచి పుట్టింది కనుక ఆమెకు ఆమె తండ్రి ఏమి పేరు పెట్టాడు? నాగటి చాలు. అనే పేరు పెట్టుకున్నాడు, జనకుడు. నాగటి చాలు అని మనం తెలుగులో అంటాం. కానీ, సంస్కృతంలో సీత అంటారు. సీత అంటే నాగటి చాలు అని అర్థం. సీత అని ఆమెకు పేరు పెట్టాడు, జనకుడు. అంటే అర్థమేమి? క్షేత్రంలో దాగి ఉండి, క్షేత్రమును జ్ఞానమనే నాగలిచేత దున్నితే, వెలుపలికి వచ్చి, దర్శనం ఇచ్చే తల్లి, సీత. అదే మన ఆత్మ. ఇది రావణ నీత. ఎక్కడ నుండి? తతః –పరమాత్మ నుండి. తతో రావణనీతాయాః సీతాయాః, ఆమె యొక్క, "పదం అన్వేష్టుమ్"– ఆమె ఉండే జాడను కనిపెట్టడానికి, వెతకడానికి బయలుదేరాడు. ఎవడు? శత్రుకర్శనః. ఎవడు వెళ్లాలి? ఎవడికంటేవాడికి కంటికి కనిపించదు శత్రుకర్శనుడే వెళ్ళాలి. ఎవడు శత్రుకర్శనుడు. మన హనుమ.

# పేరులోని పెన్నిధి

భగవంతుడైన శ్రీమన్నారాయణుని సహజమైన అనుగ్రహం చేత ఏ దోషం లేని జ్ఞాన భక్తి వైరాగ్యాలను పొంది, ఆ భగవంతుని అనుభవంలో ఓలలాడుతూ, తమ అనుభవాన్ని మధురమైన ద్రావిడ ప్రబంధాల రూపంలో మనకు అందించిన మహనీయులు, ఆళ్వారులు. వీరు పదిమంది. ఈ పదిమంది ఆళ్వారులలో పెరియాళ్వార్లు ఒకరు. ద్రావిడ భాషలో పెరియ అంటే పెద్ద అని అర్థం. అందుచేత ఈ పదానికి పెద్ద ఆళ్వార్లు అని అర్థం. ఈ ఆళ్వారులే విష్ణుచిత్తులు అని, భట్టనాధులు అని సంప్రదాయంలో పిలువబడుతున్నారు. గోదాదేవిని పెంచిన తండ్రి కూడా వీరే.

లోకంలో ఎవరినైనా ఒకరిని పెద్ద అని పిలవాలంటే, వారు వయస్సు వల్ల కానీ, ప్రభావం చేతకాని, లేదా, వేరొక కారణం వల్ల కానీ పెద్ద అయి ఉండాలి కదా. మరి విష్ణు చిత్తులను పెరియాళ్వారులు అని పిలవడానికి గల కారణాలు ఏవి?అనే విషయాన్ని కొంచెం గమనిద్దాం. వీరిని ఈ నామంతో వ్యవహరించడానికి కల కారణాలు ఏమయి ఉంటాయి? అని గమనిస్తే, వీరు కాలం వల్ల పెద్ద కాదు. ఎందుకంటే, వీరికి ముందు ఆరుగురు ఆళ్వారులు జన్మించారు. కాలక్రమాన్ని బట్టి చూస్తే, వీరు ఏడవవారు. అందుచేత కాలాన్ని అనుసరించి వీరిని పెద్ద అని అనడానికి లేదు.

వీరు ఎక్కువ సంఖ్యలో ప్రబంధాలను రచించడం గాని, ఎక్కువ సంఖ్యలో పాశురాలను రచించడం గాని చేసి ఉంటే, ఆ కారణం వల్ల కూడా

వీరిని పెరియాళ్వార్లు అని వ్యవహరించి ఉండవచ్చు. గమనించి చూస్తే, ఆకారణం కూడా కనబడదు. ఎందుకంటే, అందరికంటే ఎక్కువ సంఖ్యలో పాశురాలను రచించిన ఆళ్వారులు నమ్మాళ్వారులు.

మరి, వీరిని పెరియాళ్వార్లు అని పిలవడానికి గల కారణమేమై ఉంటుంది? అనే ప్రశ్నకు ఇద్దరు మహాచార్యులు రెండు విధాలైన సమాధానాలను మనకు తెలియజేశారు. అవి ఏమిటో చూద్దాం.

శ్రీమణవాళ మహామునులు అని శ్రీవైష్ణవ సంప్రదాయంలో ప్రసిద్ధి చెందిన శ్రీవరవరమునులు ఉపదేశ రత్తినమాలై అనే ప్రబంధంలో ఈ సందేహానికి సమాధానాన్ని పలుకుతూ, "మంగళాశాసనత్తిన్ మత్తుళ్ళ ఆళ్వార్గళ్ తంగళ్ ఆర్వత్తళవు తానన్ఱి పొంగుమ్ పరివాలే విల్లిపుత్తూర్ పట్టర్ పిరాన్ పెత్తాన్ పెరియాళ్వార్ ఎన్నుమ్ పెయర్" (భగవంతునకు మంగళా శాసనం చేయడంలో మిగిలిన ఆళ్వార్లకు ఉండే ఆర్తికంటే మించిన ఆర్తిని కలిగి ఉన్నవారు కనుక, శ్రీవిల్లి పుత్తూరులో జన్మించిన భట్టనాథులు పెరియాళ్వార్ అనే పేరును పొందారు) అని అంటూ ఈ పేరు రావడానికి గల కారణాన్ని చాలా అందంగా, సహేతుకంగా తెలియజేశారు. దీనినిబట్టి భగవంతునకు మంగళాశాసనం చేయడం అనే విషయంలో మిగిలిన అళ్వార్ల కంటే ఎక్కువ ఆర్తిని కలిగి ఉన్నందున వీరికి ఈ పేరు వచ్చినదని తెలుస్తున్నది. ఇది ఒక విధమైన సమాధానం.

శ్రీ వేదాంతదేశికులు అనే ఇంకొక మహనీయులు వేరొక చక్కని సమాధానాన్ని గోదా స్తుతి అనే ఒక స్తోత్రంలో ఈ విధంగా తెలియజేశారు.

తాత స్తు తే మధుభిదః స్తుతిలేశవశ్యాత్

కర్ణామృతైః స్తుతిశతై రనవాప్తపూర్వమ్,

తన్మౌలిగంధసుభగా ముపహృత్య మాలాం

లేభే మహత్తరపదానుగుణం ప్రసాదమ్.

గోదాదేవీ! నీ తండ్రి అయిన విష్ణుచిత్తులు, చిన్నస్తుతికి కూడా వశమవుతున్న భగవంతుని విషయంగా, చెవులకు అమృతంవంటి వందలకొద్ది పాశురాలను రచించినప్పటికీ పొందని గొప్పదైన అనుగ్రహాన్ని ఎప్పుడు పొందారు? అంటే, నీవు నీ శిరస్సులో అలంకరించుకొన్నందున చాలా అందమైన పూమాలికను భగవంతునకు సమర్పించి, పొందారు.

విష్ణుచిత్తులు చాలా మధురమైన, వీనుల విందు అనదగిన ఎన్నో వందల కొద్దీ పాశురాలను తమ ప్రబంధంలో రచించారు. భగవంతుడైతే, స్తుతిప్రియుడు. ఎవరు ఏ చిన్న స్తుతిని చేసినా, ఆనందించేవాడు. అటువంటి భగవంతుని వద్ద నుండి తాము రచించిన మధురమైన పాశురాల వల్ల పొందలేని గొప్ప అనుగ్రహాన్ని గోదాదేవి శిరస్సులో అలంకరించుకున్న పూలమాలికను ఆ భగవంతునకు సమర్పించినందునందున పొందారట. అంటే, పెరియాళ్వార్లు రచించిన పాశురాలను విన్నప్పుడు భగవంతునకు కలిగిన ఆనందం కంటే, గోదాదేవి శిరస్సులో ముడుచుకున్న పూమాలికను ఆ విష్ణుచిత్తులు సమర్పించినప్పుడు భగవంతునకు కలిగిన ఆనందం గొప్పది– అని భావం. ఈ విధంగా భగవంతుని వద్దనుండి గొప్ప అనుగ్రహాన్ని పొందినందువల్ల వీరికి పెరియాళ్వార్లు అనే పేరు వచ్చింది– అని అంటారు, దేశికులు శ్రీరంగంలో దర్శనమిచ్చే మూలమూర్తి శ్రీరంగనాథునకు

సంప్రదాయంలో పెరియ పెరుమాళ్ అని పేరు. అంటే, అందరికంటే చాలా పెద్దవాడు అని అర్థం. పెరుమాళ్ అంటేనే పెద్దవాడు అని అర్థం. భగవంతుడు అందరికంటే అధికుడు గనుక, పెరుమాళ్ అని పేరు వచ్చింది. అనేక దివ్య క్షేత్రాలలో ఎన్నో భగవన్మూర్తులు ఉన్నప్పటికీ, వాటిలో శ్రీరంగంలో ఉండే శ్రీ రంగనాథుని అర్చామూర్తియే ప్రధానమని శ్రీవైష్ణవ సంప్రదాయంలో భావింపబడుతున్నందున, శ్రీరంగంలోని మూలమూర్తికి పెరియ పెరుమాళ్ అనే పేరు వచ్చింది.

ఇటువంటి శ్రీ రంగనాథునకు తాను పెంచిన గోదాదేవిని ఇచ్చి, విష్ణుచిత్తులు వివాహం చేశారు. అంటే, పెరియ పెరుమాళ్ కు మామగారు అయ్యారు. లోకంలో అల్లునకు మామగారు గౌరవనీయుడు కదా. అందుచేత అందరికంటే పెద్దవాడుగా పరిగణింపబడే శ్రీరంగనాథునకు కూడా విష్ణుచిత్తులు గౌరవనీయులు అయ్యారు. కనుక వారికి పెరియాళ్వార్లు అనే పేరు వచ్చింది అని వేదాంతదేశికుల చమత్కార సూక్తి.

# ఎవరి ప్రేమ గొప్పది?

" ప్రియో హి జ్ఞానినో ఽత్యర్థ మహం, స చ మమ ప్రియః" (జ్ఞాని అయినవానికి నేను చాలా మిక్కిలి ఇష్టమైనవాడను. నాకుకూడా అతడు ఇష్టమైనవాడు) అని అంటూ గీతాచార్యుడు భగవద్గీతలో ఒకచోట అన్నాడు. ఇక్కడ "అత్యర్థం" అంటే "చాలా ఎక్కువ" అని అర్థం. ఏఏఈ సూక్తిని బట్టి చూస్తే, భగవంతునకు భక్తుని పై ఉండే ప్రేమ కంటే, భక్తునకు భగవంతునిపై ఉండే ప్రేమ అధికం– అని చెప్పినట్లు పై పైన మనకు కనిపిస్తుంది. ఈ క్రమంలో అన్వయం "అత్యర్థం" అనే ప్రయోగాన్ని "జ్ఞానినః అహం అత్యర్థం ప్రియః" అనే విధంగా అన్వయించవలసినట్లు తోస్తుంది.

కానీ, వాస్తవానికి లోకంలో ఉండే స్థితిని గమనించినప్పుడు, ఈ క్రమంలో వేరుగా ఉన్నది. కుమారునకు తండ్రి పై ఉండే ప్రేమ కంటే, ఆ కుమారునిపై తండ్రికి గల ప్రేమే అధికంగా మనకు కనిపిస్తుంది. అందుచేత పై సూక్తి లోని అన్వయాన్ని ఏ విధంగా గ్రహించడం యుక్తంగా ఉంటుంది? అనే గమనించినప్పుడు, "స చ మమ అత్యర్థం ప్రియః" అనే అన్వయాన్ని గ్రహించడం యుక్తంగా మనకు కనబడుతుంది.

అయితే, ఈ విధంగా ఉండే అన్వయం శ్రీరామానుజుల గీతా భాష్యంలో కనిపించదు. గీతాభాష్యంలో, ఈ గీతాసూక్తిని వ్యాఖ్యానిస్తూ శ్రీరామానుజులు, "సో ఽపి తథైవ మమ ప్రియః" (ఆ జ్ఞాని కూడా నాకు ఆ విధంగానే ఇష్టమైనవాడు) అని మాత్రమే వివరించారు. అందువల్ల

"భగవంతునకు భక్తుడు ఆ విధంగానే ఇష్టమైనవాడు" అని మాత్రమే ఇక్కడ చెప్పినట్లయినది.

కానీ, ఈ "అత్యర్థం" పదాన్ని శ్రీరామానుజులు "స చ మమ ప్రియః" అనే ప్రయోగంతో అన్వయించి అర్థం చెప్పిన సందర్భంకూడా మనకు కనిపిస్తుంది. ఎక్కడ? అంటే, వారు తమ శ్రీభాష్యగ్రంథంలో చిట్ట చివరి సూత్రాన్ని వ్యాఖ్యానించేటపుడు, "స చ పరమపురుషః సత్యసంకల్పో అత్యర్థ ప్రియం జ్ఞానినం లబ్ధ్వా, న కదాచిత్ ఆవర్తయిష్యతి" (సత్యమైన సంకల్పాన్ని కలిగిన ఆ పరమపురుషుడు తనకు చాలా ఇష్టమైన జ్ఞానిని పొంది, అతనిని మళ్లీ ఏ సమయంలోనూ తిరిగి ఈ లోకంలోనికి రానివ్వడు) అని అంటూ, దీనికి ప్రమాణంగా పై గీతాసూక్తిని ఉదాహరించారు. అందుచేత ఇక్కడ శ్రీరామానుజులు, "భగవంతునకు భక్తుడు చాలా ఇష్టమైనవాడు" అనే అర్థాన్ని గ్రహించినట్లు మనకు స్పష్టమవుతున్నది.

ఇటువంటి విలక్షణమైన అన్వయాన్ని శ్రీరామానుజులు చేయడానికి ఏది మూలం? అని గమనిస్తే, నమ్మాళ్వారులు రచించిన తిరువాయ్ మొళి ప్రబంధంలోని చివరి పాశురమే అని మనకు తెలుస్తుంది. ఈ పాశురంలో ఆళ్వార్లు "అంతటా వ్యాపించి, నిత్యమై ఉండే ప్రకృతి తత్వం కంటే, ఆ ప్రకృతి తత్వాన్ని మించి ఉండే ఆత్మ తత్వం కంటే, ఆ ప్రకృతి తత్వాన్ని, ఆత్మ తత్వాన్ని నియమించే పరమాత్మ తత్వం కంటే మించిన నా గొప్ప అభినివేశాన్ని, భగవంతునకు తనపై కల అభినివేశంతో పోలిస్తే, నాకుండే అభినివేశం పర్వతం ముందు పరమాణువు వలె చాలా

అల్పమైపోయింది" అని అన్నారు. అంటే, భగవంతునిపై తమకు ఉండే ఆర్తికంటే, తమపై భగవంతునకు గల ఆర్తితో పోలిస్తే అది చాలా అల్పమని ఈ సూక్తిలోని భావం. దీనిని దృష్టిలో పెట్టుకుని శ్రీరామానుజులు పైన తెలిపిన రీతిలో శ్రీ భాష్యంలో చివర వివరించారు.

ఇది, ఒక మధురమైన, ఉభయవేదాంత సమన్వయాత్మకమైన వివరణం.

సాంప్రదాయిక వ్యాస మాలిక–14

## ఉభయ వేదాంతైకకంఠ్యమ్

సుమారు నూరు సంవత్సరాల క్రితం ఉ. వే. శ్రీమాన్. కార్పంగాడు దేశిక వరదాచార్యస్వామివారు అనుగ్రహించిన వ్యాసం

★★★★

ఇక్కడ, "సంస్కృత వేదం, ద్రావిడ వేదం అనే రెండు ఒకే అభిప్రాయాన్ని కలిగినవి" అనే విషయాన్ని వివరించడానికి ఆరంభించినందున, దానికి తగినట్లు ఉభయ వేదాంతైకకంఠ్యం అనే శీర్షిక పెట్టబడింది. ఐకకంఠ్యం అంటే ఒకే అభిప్రాయాన్ని కలిగి ఉండడం.

పరబ్రహ్మను తెలుసుకోవాలి అనే కోరిక గలవాడు "మానాధీనా మేయసిద్ధిః" అనే విధంగా, ప్రమాణాన్ని పురస్కరించుకునే దానిని తెలుసుకోవాలి. ప్రమాణాలు అనేకం. వాటిలో వేద ప్రమాణమే గొప్పది. లక్ష్మీపతి అనే సర్వేశ్వరుడు దోషం లేనివాడై, కల్యాణ గుణాలకు ఆకరమై ఉన్నందున, చేతనాలు, అచేతనాలు అనే ఈ రెండిటి కంటే విలక్షణుడై ఉన్నట్లే, ఆ స్వామిని తెలియజేసే వేదం కూడా ఆపౌరుషేయత్వం, అంటే, ఏ పురుషునిచే నిర్మింపబడకుండా ఉండడం, నిత్యత్వం, అంటే, ఎల్లప్పుడూ నిలచి ఉండేదై ఉండడం అనే రెండిటిచేత గొప్పతనాన్ని కలిగి ఉన్నందున, విలక్షణమైనదని చెప్పబడుతున్నది. ఈ విషయం "వేదాత్ శాస్త్రం పరం నాస్తి, న దైవం కేశవాత్పరమ్" (వేదం కంటే గొప్ప శాస్త్రం ఏదీ లేదు, కేశవుని కంటే గొప్ప, దైవం ఏదీ లేదు) అనే హరివంశశ్లోకం ద్వారా తెలియవచ్చును. ఈ వేదం అనేది సంస్కృతం, ద్రావిడం అనే రెండు విభాగాలను కలిగినదై ఉంటుంది. ఇక్కడ, ద్రావిడ వేదం అని

నిర్దేశింపబడినది ఏది అంటే, ఆళ్వారులు అనబడే మహనీయుల చేత అనుగ్రహింపబడిన దివ్య ప్రబంధమే. ఈ ఆళ్వారుల చేత అనుగ్రహింపబడిన దివ్యప్రబంధం నిత్యమైన వేదంలో చేరినదే- అనేది ఏ విధంగా పొసగుతుంది? అని అంటే, ఋషుల చేత దర్శింపబడి, వ్యక్తం చేయబడిన మంత్రాలు వేదంలో అంతర్భవించినట్లే, ఆళ్వారులచేత దర్శింపబడి, వ్యక్తం చేయబడిన దివ్యప్రబంధం కూడా నిత్యం అని అనడంలో ఏ విధమైన విరోధం లేదు కనుక, అది వేదం అని అనడంలో ఏ అడ్డు లేదు.

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,
వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా"

(వేదంచేత తెలియబడదగిన సర్వేశ్వరుడు దశరథుని కుమారుడై అవతరించగా, వేదంకూడా సాక్షాత్తు శ్రీరామాయణ రూపంలో అవతరించింది)

సర్వేశ్వరుడు దశరథ కుమారుడై అవతరించినప్పుడు, అతని పరత్వాన్ని తెలియజేసే వేదంకూడా రామాయణంగా అవతరిస్తుంది- అనే స్కాందపురాణంలో చెప్పినట్లుగా, ఆ భగవంతుడు శ్రీరంగం మొదలైన దివ్యదేశాలలో అర్చారూపంలో అవతరించేటప్పుడు, ఆ వేదం కూడా ద్రావిడవేద రూపంగా అవతరించింది అని తెలియాలి. దీనివల్ల ప్రమేయ వస్తువు అయిన సర్వేశ్వరుడు సర్వసులభుడై ఉండే అర్చావతారాన్ని పరిగ్రహించగా, ఆ స్వామినిగూర్చి తెలియజేసే వేదంకూడా

సర్వసులభమై, సర్వాధికారమై ఉండే ద్రావిడవేదరూపాన్ని పొందింది– అని వ్యక్తం అవుతున్నది.

ఈ విధంగా, సంస్కృతవేదం, ద్రావిడవేదం అని విభాగం, చేయడానికి తగినట్లుగా " స్వమ్ సంస్కృత ద్రావిడవేదసూక్త్యై" ఇత్యాదిగా పరాశర భట్టర్ మొదలైనవారు, " అమ్నాయానాం ప్రకృతి మపరాం సంహితాం దృష్టవంతమ్" (వేదంలోని వేరు రూపమైన సంహితను, అంటే, ద్రావిడ వేదరూపమైన వేదాన్ని దర్శించినవారు), " ద్రావిడబ్రహ్మదర్శీ" (ద్రావిడ వేదాన్ని దర్శించినవారు), " కృతినః కమలావాస కారుణ్యైకాంతినో భజే, ధత్తే యత్సూక్తిరూపేణ త్రివేదీ సర్వయోగ్యతామ్" (వేదాలు ఎవరి తిరువాయ్ మొళి రూపంలో ఏర్పడినందున సకల విధమైన గొప్పతనాన్ని పొందినవో, ఆ తిరువాయ్ మొళి ప్రబంధాన్ని అనుగ్రహించినవారు, శ్రీహరి యొక్క కరుణకు పాత్రమైనవారు, మహానుభావులైన నమ్మాళ్వారులను ఎల్లప్పుడూ సేవిస్తున్నాను) అని మొదలైన సూక్తులతో వేదాంత దేశికులు కూడా పలకడం ఇక్కడ గ్రహించాలి.

ఈ వేదంలోని పూర్వభాగం, భగవంతుని ఆరాధన రూపమైన కర్మలను గూర్చి తెలుపుతున్నది. ఉత్తరభాగం అనే వేదాంతం, బ్రహ్మను సాక్షాత్తు తెలుపుతున్నది. దీనికి ఉపనిషత్తులు అని కూడా పేరు. ఈ సంస్కృతోపనిషత్తు సర్వేశ్వరుని స్వరూప రూప గుణ విభూతి లీలాదులను స్పష్టంగా చెప్పేటట్లే, ఆళ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్ మొళి ప్రబంధంకూడా భగవంతుని స్వరూప రూప గుణ విభూతి

లీలాదులను స్పష్టంగా తెలియజేస్తున్నందున, దీనికి ద్రవిడోపనిషత్తు అని వేదాంతవిజ్ఞానాన్ని కలవారిచేత వ్యవహరింపబడుతున్నది. ఈ విషయం ద్రవిడోపనిషత్ సంగతి, ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి అని వ్యవహరింపబడే గ్రంథాల పేర్ల ద్వారా తెలియవచ్చును.

ఇంతేకాక, ఈ ఉభయ వేదాంతాలను గమనించి చూసినప్పుడు, వేదవ్యాసులచే రచింపబడిన సంస్కృత వేదాంతవిచారమైన శారీరకమనే శాస్త్రంలోని సారార్థాలనే ఆళ్వారులు అవతరించి తిరువాయ్ మొళి రూపంలో ప్రకాశింప చేశారు. ఆ తరువాత, "మాఅన్ ఆడి పణిందు ఉయ్న్దవన్" అయిన శ్రీ రామానుజులు అవతరించి తిరువాయ్ మొళి ప్రబంధాన్ని ఆధారంగా చేసుకుని, బ్రహ్మసూత్రార్థ నిర్ణయం చేసి, శ్రీభాష్యం అనే గ్రంథాన్ని రచించారు అని అర్థమవుతుంది. ఈ వృత్తాంతం " ఆదౌ శారీరకార్థః క్రమమిహ విశదం వింశతిః వక్తి సాగ్రా" (తిరువాయ్ మొళి ప్రబంధంలోని మొదటి 20 పాశురాలు శారీరక మీమాంసాశాస్త్రాన్ని స్పష్టంగాను, పూర్ణంగాను తెలియజేస్తున్నవి) అనే వేదాంతదేశికుల శ్రీ సూక్తి వల్ల, " భాష్యకారర్ ఇదు కొండు సూత్రవాక్యంగళ్ ఒరుంగవిడువర్ " (శ్రీరామానుజులు తిరువాయ్ మొళి ప్రబంధాన్ని ఆధారంగా చేసుకొని బ్రహ్మసూత్రవాక్యాలను వివరించారు) అనే అళగియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ సూక్తి వల్ల, " పురా సూత్రైః వ్యాసః శ్రుతిశత శిరో ఽ ర్థం గ్రథితవాన్ వివవ్రే తమ్ శ్రావ్యం వకులధరతా మేత్య చ పునః, ఉభౌ ఏతౌ గ్రంథౌ ఘటయితు మలం యుక్తిభి రసౌ పునః జజ్ఞే రామానుజ ఇతి స బ్రహ్మముకురః" (పూర్వం వ్యాసభగవానుడు వేదాంతార్థాలను

సూత్రరూపంగా రచించారు. వారే మళ్లీ, ఆ సూత్రార్ధాన్ని వకుళాభరణుల రూపంగా అవతరించి, అందరూ వినడానికి మధురమైన, ద్రావిడ రూపమైన వివరణ ప్రబంధంగా రచించారు. ఆ రెండు గ్రంథాలను యుక్తులతో సమన్వయం చేయ గోరి, అందుకోసం మళ్లీ వారే రామానుజులు అనే పేరుతో అవతరించారు. వీరే బ్రహ్మస్వరూపాన్ని అద్దంవలె ప్రదర్శించినవారు) అనే ఆచ్చాన్ పిళ్లై శ్రీసూక్తి వల్ల స్పష్టమవుతున్నది.

ఇంతే కాక, ఈ ఉభయవేదాంతాలు కూడా ఒకదానితో ఇంకొకటి అనుసరించే అర్థాలను తెలుపుతాయి అనేది ఆ యా వాక్యాలద్వారా తెలియవచ్చు. అది ఏ విధంగా అంటే, సంస్కృత వేదాంతంలో "బ్రహ్మ వాదినో వదంతి" అని, "యే తత్ర బ్రాహ్మణా సంమర్శినః" అని, ద్రావిడ వేదాంతంలో "ఉళన్ శుడర్ మికు శురిదియుళ్" అని చెప్పే వాక్యాల ద్వారా ఒకదానితో ఇంకొకటి సమన్వయం అవుతూ, అర్థ ప్రతిపాదనను చేస్తున్నాయి– అని తెలుస్తున్నది. దీనిని మనసులో పెట్టుకొని శ్రీయామునులు స్తోత్రరత్నంలో "విధయశ్చ వైదికాః త్వదీయ గంభీరమనోనుసారిణః" (వేదవిధులు కూడా నిన్ను ఆశ్రయించిన పెద్దల గంభీరమైన హృదయాన్ని అనుసరిస్తున్నాయి) అని అన్నారు.

ఇంక, తిరువాయ్ మొళి ప్రబంధం బ్రహ్మ సూత్రార్థాలను అంతర్భవించుకున్నది అనే విషయం నిరూపింపబడుతుంది.

శారీరకమీమాంస అని చెప్పబడే బ్రహ్మసూత్ర గ్రంథం నాలుగు అధ్యాయాలను కలిగినది. ఆ నాలుగు అధ్యాయాలు నాలుగు అర్థాలను

తెలియజేస్తాయి. అవి ఏవి అంటే, కారణత్వం, అబాధ్యత్వం, ఉపాయత్వం, ఉపేయత అనే నాలుగు విషయాలు చెప్పబడుతున్నాయి. వాటిలో, మొదటి అధ్యాయంలో కారణత్వం చెప్పబడుతున్నది. రెండవ అధ్యాయంలో అబాధ్యత్వం చెప్పబడుతున్నది. అబాధ్యత్వం అంటే, బాధింపబడకపోవడం. ఈ అధ్యాయంలో, ఏ రీతిలోనూ, ఏ విధమైన కొరత లేని సర్వపరిపూర్ణుడైన సర్వేశ్వరునకు ఏ విధమైన ప్రయోజనం పొందవలసిన అక్కరలేదుకదా. ఆ విధంగా ఉండగా, సృష్టి మొదలైనవి ఏ విధంగా కుదురుతాయి? అని ఆక్షేపించి, సృష్టి మొదలైనవి లీల కనుక కుదురుతాయి అని విరోధిపరిహారం చెప్పబడింది. మూడవ అధ్యాయంలో ఉపాయత్వం చెపబడింది. నాలుగవ అధ్యాయంలో ప్రాప్యత్వం చెప్పబడింది.

ఈ నాలుగు అధ్యాయాలలోని అర్థాలు తిరువాయ్ మొళి ప్రబంధంలోని మొదటి పాశురం అయిన ఉయర్ వఱ ఉయర్ నలమ్" అనే పాశురంలో అమరి ఉన్నాయి. అది ఏ విధంగా అంటే, మొదటి అధ్యాయంలో చెప్పబడిన భగవంతుని కారణత్వం, దానిచేత ఆక్షేపింపబడిన భగవంతుని కళ్యాణగుణాలు "నలముడైయవన్" అనే సూక్తి ద్వారా చెప్పబడ్డాయి. రెండవ అధ్యాయంలో చెప్పబడిన అబాధ్యత్వం ", ఉయర్ వఱ ఉయర్" అనే సూక్తి ద్వారా చెప్పబడింది. ఇందువల్ల రెండవ అధ్యాయంలోని అర్థం ఏ విధంగా లభిస్తున్నది? అని అంటే, "ఉయర్ వు" అంటే బాధ. ఏ విధమైన బాధ లేకుండా ఉన్నతంగా ఉన్నది– అని ఇక్కడ అర్థం. దీనివల్ల బ్రహ్మాదుల ఔన్నత్యానికి ఒక లోటు

కలిగినప్పుడు, తపస్సు మొదలైన వాటిచేత బాధ కలిగినట్లుగా కాకుండా, స్వాభావికమైన ఔన్నత్యాన్ని, కళ్యాణ గుణాలను కలిగినవాడు, భగవంతుడు– అని ఇక్కడ స్పష్టమవుతుంది. ఇంతే కాకుండా, కారణం అయ్యేటప్పుడు భగవంతుడు లీలగా జగత్తు సృష్టి మొదలైనవాటిని చేస్తున్నాడు– అనే అర్థం కూడా లభిస్తున్నందున, ఇక్కడ "లోకవత్తు లీలాకైవల్యమ్" అనే సూత్రార్థం కూడా తెలుపబడినట్లయినది. "మయర్వఱ" అనే పదంచేత మూడవ అధ్యాయం మొదటి పాదంలో చెప్పబడిన అజ్ఞానానికి తగిన శరీరసంబంధమైన జీవదోషం చెప్పబడింది. "మదినలమ్" అని అన్నందున మూడవ అధ్యాయం, మూడవ పాదంలో చెప్పబడిన సాధ్యోపాయమైన భక్తి చెప్పబడింది. "అరుళినన్" అని అన్నందున "ఉపపత్తేః" అని సూత్రార్థంలో చెప్పబడిన సిద్ధోపాయంయొక్క ఉపాయత్వం చెప్పబడింది. "అయర్వఱు మమరర్ కళ్ అదిపతి", అని అన్నందున నాల్గవ అధ్యాయంలో సూచింపబడిన అర్చిస్సు మొదలైన ఆతివాహికులు చెప్పబడ్డారు. "తుయరఱు" అని అన్నందున "ఉత్తరపూర్వాఘయోః" అనే సూత్రార్థంలో చెప్పబడిన అవిద్యానివృత్తి చెప్పబడింది. "శుడరడి తొళుదు" అని అన్నందున ", సంపద్యావిర్భావ" సూత్రంలో చెప్పబడిన స్వాభావిక గుణావిర్భావ కార్యమైన నమస్కరించడం చెప్పబడింది. ఇది అంతా అటు ఉండనివ్వండి.

శ్రీరామానుజులు "ఉయర్ వఱ ఉయర్ నలమ్" అని ప్రారంభమవుతున్న పాశురం బ్రహ్మసూత్రార్థాన్ని అంతర్భవించుకున్న

విషయాన్ని శ్రీభాష్యగ్రంథ ప్రారంభంలో తాము అనుగ్రహించిన మంగళశ్లోకంలో వివరించి తెలియజేశారు. అది ఏవిధంగా? అంటే,

అఖిలభువన జన్మ స్థేమ భంగాదిలీలే
వినత వివిధ భూతవ్రాత రక్షైకదీక్షే,
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.

(సకల లోకాల సృష్టి స్థితి సంహారాలను లీలగా కలిగినవాడు, తనను శరణు పొందిన సకలజీవుల సంరక్షణ కార్యంలో దీక్షితుడు, వేదాంతాలలో చెప్పబడిన ఉన్నతమైన అర్థాలలో వెలిగే గొప్ప దీపంవంటివాడు, బ్రహ్మస్వరూపి, ఏ విధమైన బాధ లేని ఉన్నతమైన కల్యాణగుణాలను కలిగినవాడై ఉండే శ్రీనివాసుని విషయంలో భక్తిరూపమైన జ్ఞానం నాకు కలగాలి.

ఈ శ్లోకంలో "ఉయర్ వఱ" అనే పాశురంలో "ఉయర్వ్వు" అనే నిషేధపదపూర్వకంగా పలికినట్లే, ఈ శ్లోకంలో కూడా "అఖిల" అనే నిషేధపదపూర్వకంగా ఆరంభం చేయబడింది. శాస్త్రారంభంలో మంగళపద ప్రయోగం చేయవలసి ఉండగా, అమంగళపదపూర్వకంగా ఆరంభం చేయడం ఎందుకు? "న ఖిలం యత్ర" అని వ్యుత్పత్తిని కలిగిన అఖిల శబ్దంయొక్క ఆకారం. ఖిల అనే అమంగళపదాన్ని నిషేధించే నిషేధం కనుక మంగళాన్ని సూచించేదే అవుతున్నది. అందుచేత ఈ విధంగా గ్రంధారంభాన్ని అఖిల శబ్దంతో చేయవచ్చు –అని తెలియాలి. ఈ విషయం ఉండండి. ", అఖిలభువన జన్మ స్థేమ భంగాదిలీలే" అనే

విశేషణాల చేత, "ఉయర్ వఱ ఉయర్ నలముడైయవన్" అనే ప్రయోగంచేత చెప్పబడిన జగత్కారణత్వం వివరింపబడింది. "వినత" అనే పదం చేత "మదినలమ్" అనే పదంలోని అర్థం అయిన భక్తి చెప్పబడింది. "రక్షైకదీక్షే" అని అన్నందున "తుయరఱు శుడరడి" అనే ప్రయోగంలో చెప్పబడిన అనిష్టనివృత్తి పూర్వకమైన ఇష్టప్రాప్తి చెప్పబడినది. "వినత" అని అన్నందున భక్తిచే సత్తను పొందడం చెప్పబడింది. ఇందువల్ల, భక్తి కలగడానికి ముందు సత్త లేదు– అనే విషయం తెలుస్తున్నది. ఈ అర్థం "మదినల మరుళినన్" అనే చోట "నాకు అనుగ్రహించాడు" అని లేకుండా, భక్తి కలగడానికి ముందు తమకు సత్త లేకపోవడాన్ని తెలుపడంకోసం ఆ విధంగా చెప్పడం జరిగింది. భక్తి కలిగిన తరువాత తమకు సత్త కలగడాన్ని "ఎన్ మననే! "అని అంటూ తెలియజేశారు. "వ్రాత" అని అన్నందున సంబంధ సంబంధులు కూడా చెప్పబడ్డారు. " ఎనక్కు మయర్ వఱ" అని లేనందున, తమకు చెందినవారుకూడా ఫలాన్ని అనుభవించడం తెలియజేశారు. తమతోబాటు తమకు చెందినవారిని కూడా కలుపుకోవడం అనేది ఆళ్వార్లకు సహజంగా ఉండే అలవాటు. ఈ విషయం "పొయ్ న్నిన్ఞ", "కేశవన్ తమర్" అనే మొదలైన చోట్ల "యామ్" అని, " ఎమ్ "అని ఇతరులకోసం తమపై బహువచనాన్ని ఆరోపించుకొని చెప్పడాన్ని గమనించవచ్చు. ", వినత" అని అన్నందున భక్తి లభించినప్పటికీ, "భక్తిరూపా" అని చెప్పినందున, ఇందులో చెప్పబడే భక్తి అనేది ప్రార్థించే పొందదగినది– అనే విషయం చెప్పబడింది.

"ఇది ప్రార్థనీయం" అనే విషయం నాల్గవ అధ్యాయంలో "ఆవృతిరసకృత్ " ఇత్యాది సూత్రంతో భక్తిని విచారించడంద్వారా తెలియవచ్చు. అంతేకాక, ", బ్రహ్మను గూర్చి విచారించాలి" అని చెప్పదగిన సందర్భంలో " బ్రహ్మజిజ్ఞాసా"– తెలియాలనే కోరిక, అంటే, కోరాలి అని చెప్పబడింది. ఈ విధంగా చెప్పడానికి "నిదిధ్యాసితవ్యః" అనే శ్రుతియే మూలం. ఇక్కడ కూడా ఈ విధంగా చెప్పడానికి కారణం, "అది ప్రార్థించే పొందదగినది"– అని చూపడం కోసమే.

ఈ శాస్త్రంలో చెప్పబడే భక్తి భగవత్కామం అని చెప్పబడుతుంది. ఈ భక్తి ప్రహ్లాదుని చేత " యా ప్రీతి రవివేకానాం విషయేష్వనపాయినీ, తామనుస్మరతః స్సా మే హృదయా న్నాపసర్పతు" (వివేకం లేనివారికి లౌకిక విషయాలలో ఏ ప్రీతి నిరంతరంగా ఉంటుందో, అటువంటి ప్రీతి అనేది, నిన్ను నిరంతరం భావిస్తూ ఉండే నా హృదయాన్ని విడచి పోకుండా ఉండాలి) అని అంటూ ప్రార్థింపబడింది ఇటువంటి భగవత్కామం అనేది భక్తులను స్త్రీభావనను పొందేటట్లు చేస్తుంది. సామాన్యస్త్రీ లౌకికవిషయాలను గూర్చిన కామాన్ని పొందినట్లయితే, అది ఆ స్త్రీలను పురుష భావాన్ని పొందాలని అనిపించేటట్లు చేస్తుంది. కనుక, అతివిలక్షణమైన భగవద్విషయంలో అయితే, ఇక చెప్పవలసి ఉన్నదా? ఈ విషయాన్ని దేశికులు "పాంచాలీ" అని మొదలవుతున్న శ్లోకంలో చక్కగా అనుగ్రహించారు.

పాంచాలీగాత్రశోభాహృతహృదయవధూవర్గపుంభావనీత్యా
పత్యౌ పద్మాసహాయే ప్రణయిని భజతః ప్రేయసీపారతంత్ర్యమ్|

భక్తిః శృంగారవృత్త్యా పరిణమతి మునే ర్భావబంధప్రథిమ్నా

ద్రౌపది యొక్క అవయవ శోభ అనేది స్త్రీలను పురుషుని భావాన్ని పొందేటట్లు చేసేటట్లే, పురుషులను స్త్రీలుగా మాట్లాడేటట్లు చేసే పురుషోత్తముని విషయంలో కలిగి ఉండే భక్తి అనేది శృంగార రూపంగా పరిణమిస్తున్నది. ఇందువల్ల భక్తి అనేది భగవత్కామం అని చెప్పబడుతుంది. సంస్కృత వేదాంతంలో విధింపబడిన భక్తియొక్క పరిణామమైన శృంగారం తిరువాయ్ మొళి ప్రబంధంలో స్పష్టంగా చెప్పబడింది. ఇందుచేత ఉభయవేదాంతాలు ఒకే విధమైన అభిప్రాయాన్ని కలిగినవి– అని స్పష్టపడుతున్నది. ఈ విధంగానే, అక్కడక్కడ కనిపించే విషయాలను గ్రహించి సమన్వయం చేసుకోవచ్చు. భగవద్రామానుజులు తిరువాయ్ మొళి ప్రబంధాన్ని సాధనంగా చేసుకుని, బ్రహ్మసూత్ర నిర్ణయాన్ని చేసిన ఉపకారస్మృతి వ్యక్తం అయ్యేటట్లుగా, " అఖిల భువన" అనే శ్లోకానికి ఆళ్వార్ల విషయంగా అర్థాన్ని చెప్పడానికి తగినట్లుగా ఆ శ్లోకాన్ని అనుగ్రహించారు. ఈ విషయం కూడా ప్రస్తుతంలో ప్రస్తావించదగినది. దానిని ఈ విధంగా చెప్పవచ్చును.

"అఖిల భువనజన్మాది లీలః యస్య సః"– సృష్టి మొదలైన వానిని లీలగా కలిగిన సర్వేశ్వరుడు, ఏ ఆళ్వార్లకు "ఉణ్ణుమ్ శోఱు" అనే విధంగా ధారక, పోషక, భోగ్యాలుగా అయ్యాడో– అని మొదటి విశేషణానికి అర్థం. " వినత వివిధభూతవ్రాత రక్షైకదీక్షే" అనేదానికి తమను శరణాగతి చేసిన మధురకవి, నాథముని మొదలైనవారికి దివ్యప్రబంధప్రదానంచేత రక్షించేవారు– అని అర్థం. " శ్రుతిశిరసి విదీప్తే" అనేదానికి తిరువాయ్

మొళి అనే వేదాంతంలో చివరి పాశురాలలో ప్రకాశించేవారు– అని అర్థం. తిరుక్కుఱుంగుడి నంబియే నమ్మాళ్వార్లుగా అవతరించారు అనేది ప్రసిద్ధం కనుక, "బ్రహ్మణి శ్రీనివాసే " అని చెప్పబడింది. “మమ పరస్మిన్” –నాకు అభిమతంగా ఉండే పరదేవత అయిన అళ్వార్ల విషయంలో అందరికీ భక్తి కలగాలి– అని ఈ శ్లోకంలోని భావం.

# విశిష్టాద్వైతమ్

(సుమారు వంద సంవత్సరాల క్రితం కార్పంగాడు, ఉ. వే. శ్రీమాన్ దేశికవరదాచార్యస్వామివారు అనుగ్రహించిన తమిళ వ్యాసానికి ఆంధ్రానువాదం)

ఒక సిద్ధాంతానికి పెట్టి వ్యవహరించే పేరు మాత్రంతోనే ఆ సిద్ధాంతంలో అంతర్భవించి ఉండే విశేషాలన్నీ వ్యక్తం అవుతాయి కనుక, ఆ పేరు అందరిచేత ప్రశంసింపబడేదిగా ఉంటుంది. ఈ విధంగానే, ఈ విశిష్టాద్వైతం అనే పదం కూడా శ్రీవైష్ణవ సిద్ధాంతంలోని విశేషాలన్నీ తనలో అంతర్భవించుకున్నది.

ఈ విశిష్టాద్వైతం అనే పదం అద్వైతశబ్దంవలె వేదంలో చెప్పబడలేదు. కనుక, ఇది వేదసమ్మతమైన పేరు అనేవారిని "ముక్తానాం పరమాగతిః" అనే సర్వేశ్వరుని తెలియజేసే నామం, బ్రాహ్మణులు ప్రతి దినం ఆచరించే క్రియకు వాచకమైన సంధ్యావందనం అనే పేరు వేదంలో చెప్పబడలేదు కనుక, ఇవి వేద సంమతాలు కావు– అనే గ్రహించాలి అని కొందరు వాదిస్తూ నిరాకరించారు. అయితే, ఈ నామాలు అన్నీ వేదాంతంలోని తత్వాన్ని తెలిసిన తత్వదర్శులైన పెద్దలు ఔచిత్యాన్ని గ్రహించి పెట్టిన పేర్లు అని గ్రహించాలి. వేదం ప్రమాణం అయినట్లే, వేదాంతాన్ని చక్కగా తెలిసిన పెద్దల ఆచారం కూడా ప్రమాణమే. అందుచేత, ఈ విశిష్టాద్వైతం అనే పేరు పెద్దల చేత అంగీకరింపబడింది కనుక, ఆదరించదగినదే.

విశిష్టాద్వైతమ్ అనేదానిని "విశిష్టస్య, అద్వైతమ్" అని వివరించాలి. ఇది షష్ఠీవిభక్తి సమాసం. విశిష్టస్య– చేతనాచేతనాలను శరీరంగా కలిగిన వస్తువు యొక్క, అద్వైతం– రెండుగా ఉండని స్థితి. అంటే, చేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగినదిగా ఉండే విధంగాఉండే, తనకంటే వేరైన వస్తువు ఏదీ లేదు –అని అర్థం.

శరీరం అనేది అవయవాలను కలిగినదిగా కదా ఉంటుంది. ఆ విధంగా ఉండగా, నిరవయవమైన ఆత్మను భగవంతుడు శరీరంగా కలిగి ఉన్నాడు– అని అనడం ఏ విధంగా సరిపోతుంది? అంటే, ఇక్కడ శరీరం అంటే, చేతులు, కాళ్లు మొదలైన అవయవాలతో కూడినది– అని అర్థం కాదు. నియామ్యమై (నియమించదగినదై), ధార్యమై (ధరించదగినదై), శేషమై (అతిశయాన్ని కలిగించేదై) ఉండేది ఏదో, అదే శరీరం అని గ్రహించాలి. ఎందుకంటే, వేదాంతంలో, ఆత్మను కూడా సర్వేశ్వరుడు శరీరంగా కలిగినవాడై ఉన్నాడు– అని అన్నందున, దానికి తగినట్లుగా శరీర లక్షణం ఇంతకుముందు చెప్పినట్లుగా సమన్వయం చేసి చెప్పుకోవాలి. పైన తెలిపిన లక్షణం ఆత్మకే ఉన్నది కనుక, దానిని కూడా సర్వేశ్వరుడు శరీరంగా కలిగి ఉండడానికి ఏ విధమైన అడ్డంకి లేదు– అని గ్రహించాలి.

సర్వేశ్వరుడు సృష్టికి ముందు సూక్ష్మచిదచిత్తులను శరీరంగాను, సృష్టికాలంలో స్థూలచిదచిత్తులను శరీరంగానూ కలిగి ఉంటాడని తెలియాలి. సూక్ష్మచిదచిత్తులను శరీరంగా కలిగి ఉండే దశ కారణదశ అని, స్థూలచిదచిత్తులను శరీరంగా కలిగి ఉండే దశ కార్యదశ అని తెలియాలి.

అణుస్వరూపుడై, ఎల్లప్పుడూ ఒకే స్వభావాన్ని కలిగి ఉండేవాడైన ఆత్మకు స్థూలత్వం ఏ విధంగా సంభవిస్తుంది? అని అంటే, ఇక్కడ, ఆత్మ స్థూలత్వాన్ని పొందుతున్నాడు– అనేదానికి సూక్ష్మంగా ఉండే ఆత్మ పెద్దగా అవుతున్నాడు– అని అర్థాన్ని గ్రహించకూడదు. అతని జ్ఞానం ప్రకాశిస్తున్నది– అని జ్ఞానానికి స్థూలత్వాన్ని గ్రహించాలి. అంటే, ఆత్మకు కారణ దశలో అణగి ఉండే జ్ఞానం, కార్య దశలో ప్రకాశాన్ని పొందుతున్నది– అనే అర్థం.

కారణదశలో సూక్ష్మచిదచిద్విశిష్టమైన బ్రహ్మం కార్యదశలో స్థూలచిదచిద్విశిష్ట బ్రహ్మంగా అవుతున్నది– అని అంటే, ఉపాదాన కారణమైన సర్వేశ్వరునకు, మట్టి ముద్దకువలె, చిన్నగా ఉండడం, పెద్దగా ఉండడం అనే వికారాలు కలుగవలసి ఉంటుందే! అని అంటే, భగవంతునకు అవికారత్వాన్ని, ఉపాదానత్వాన్ని చెప్పే వేదవాక్యాలకు అనుగుణంగా, వికారాలను పొందుతున్న చేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగి ఉన్నవాడై, తాను ఏ విధమైన వికారాన్ని పొందనివాడై ఉన్నందున, భగవంతునకు చిన్నగా కావడం, పెద్దగా కావడం అనే దోషాలు కలగడం లేదు, ఈ దోషాలు చేతనాచేతనాలకే తప్ప, సర్వేశ్వరునకు లేవు –అని తెలియాలి.

సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మం అని చెప్పబడే కారణాలు మూడుకూడా తరువాత, స్థూలచిదచిద్విశిష్ట బ్రహ్మం అని చెప్పబడే మూడు కార్యాలుగా అవుతున్నది. ఈ మూడు కూడా కారణకార్యాలు అయ్యేటప్పుడు, ఒక్కొక్కటి ఒక్కొక్క విధమైన తేడాను పొందడం ద్వారా

కారణకార్యాలు అవుతున్నాయి. ఏ విధంగా అంటే, అచేతనం రూపంలో మార్పును పొందుతున్నది. ఆత్మ స్వభావంలో మార్పును పొందుతున్నది. సర్వేశ్వరుడు ఈ రెండిటిని శరీరంగా కలిగి ఉన్నందున, వేరు అవుతున్నాడు. ఇందువల్ల అచేతనానికి రూపంలో వికారాన్ని, చేతనానికి స్వభావంలో వికారాన్ని, ఈశ్వరునకు ఈ రెండు విధాలైన వికారాలు లేకుండా, ఈ రెండిటినీ శరీరంగా కలిగి ఉండే వేషంలో మార్పును గ్రహించాలి.

ఈశ్వరునకు సూక్ష్మచిదచిద్వస్తువులను శరీరంగా కల స్థితి వేరు కనుక, భేదం స్ఫురించేటట్లు, ముందు చెప్పిన దశ కారణావస్థ అని, తర్వాత చెప్పిన దశ కార్యావస్థ అని వ్యవహరింపబడుతుంది.

సహజంగా చల్లని స్పర్శను కల జలానికి అగ్నితో కూడిన కుండతో సంబంధం కలగడం చేత, ఉష్ణం, శబ్దం కలిగేటట్లు, సర్వేశ్వరుడు చేతనాచేతనాలను తనకు శరీరంగా కలిగిన సంబంధంచేత అచేతనానికి సంబంధించిన వికారం, అచేతనంతో కూడిన ఆత్మకు కలిగే సుఖదుఃఖాలు సర్వేశ్వరునకుకూడా కలగాలి కదా! అని అంటే, దేహంతో కూడి ఉండే ఆత్మకు దేహానికి తగిన బాల్యయౌవనావస్థలు కలగడం లేదు. ఆ విధంగానే, చేతనాచేతనాలకు సంబంధించిన వికారాలు, సుఖదుఃఖాలు ఏవీ సర్వేశ్వరునకు కలుగడం లేదు–అని తెలియాలి.

విశిష్టాద్వైతం అనే పదానికి చేతనాచేతనాలను శరీరంగా కలిగిన వస్తువుయొక్క అద్వైతం అనేది అర్థం కనుక, విశిష్ట వస్తువునకు సర్వేశ్వరత్వం చెప్పబడినట్లు అవుతున్నది. ఇందులో, చేతనాచేతనాలు

సొత్తు అని, సర్వేశ్వరుడు సొత్తుదారుడు అని వ్యక్తమవుతున్నది. సొత్తు, సొత్తుదారుడు– అనే ఈ రెండిటిలో సొత్తుదారుడు గొప్పవాడు అనే విషయం అందరూ తెలిసినదే. ఇందుచేత, బ్రహ్మకు శరీరంగా చెప్పబడే జీవాత్మసామాన్యంలో బ్రహ్మాదులు అంతర్భవిస్తారు కనుక, వారి కంటే సర్వేశ్వరుడు గొప్పవాడని స్పష్టమవుతున్నది.

ఇక, విశిష్టాద్వైతం అనే పదానికి, ఇంకొక విధంగా కూడా అర్థాన్ని చెప్పవచ్చు. విశిష్టస్య– చేతనాచేతనాలను శరీరంగా కలిగినవానియొక్క, అద్వైతం– నిమిత్తకారణం వేరు, ఉపాదాన కారణం వేరు, సహకారి కారణం వేరు అనే భేదం ఏమీ లేకుండా ఉండడం – అని కూడా చెప్పవచ్చు. అంటే, తానే నిమిత్తకారణంగాను, ఉపాదానకారణంగాను, సహకారికారణంగాను ఉండడం. నిమిత్తకారణం అంటే, కార్యరూపంగా మార్పును పొందించే కర్త. అంటే, ఒక వస్తువును నిర్మించే కర్త. మట్టి ముద్దను కుండగా చేసే కుమ్మరివాడు నిమిత్త కారణం అవుతున్నాడు. ఉపాదానకారణం అంటే– కార్యరూపంగా మార్పును పొందడానికి యోగ్యమైన వస్తువు. అంటే, కార్యంగా పరిణమించే వస్తువు. కుండగా కావడానికి యోగ్యతను కలిగి ఉండే మట్టిముద్ద ఉపాదానకారణం అవుతున్నది. సహకారికారణం అంటే, కార్యరూపంగా పరిణామం చెందడానికి ఉపకరణమైన వస్తువు. అంటే, కార్యాన్ని ఉత్పత్తి చేయడానికి సహకారంగా ఉండే సాధనమే సహకారికారణం. కుండను నిర్మించడానికి సహకారంగా ఉండే దండం, చక్రం మొదలైనవి సహకారి కారణాలు అవుతున్నాయి. ప్రస్తుతంలో, అద్వైతం అనేదానికి నిమిత్త, ఉపాదాన,

సహకారి కారణాలలో భిన్నత్వం లేకపోవడం, వేరుగా ఉండడం అనేది లేకపోవడం –అని అర్థం– అని అంటే, పైన చెప్పబడిన దృష్టాంతంలో, నిమిత్తకారణం కుమ్మరివాడు, ఉపాదాన కారణం మట్టిముద్ద, సహకారి కారణం దండం, చక్రం మొదలైనవి అవుతున్నందున, ఇక్కడ మూడు కారణాలు వేరు వేరుగా ఉండాలి కదా. ఆ విధంగా ఉండగా, మూడు కారణాలు సర్వేశ్వరుడే అవుతున్నాడు– అని అనడం ఏ విధంగా సరిపోతుంది? అని అంటే, మట్టిముద్దకు జ్ఞానం లేనందువల్ల తాను కుండగా కావటానికి తగిన నిమిత్తకారణంగా కాలేదు. అందుచేత అది కుమ్మరివానిని కోరుతున్నది. కుమ్మరివానికి కార్యంగా పరిణమించడానికి తగిన శక్తి లేనందువల్ల తాను ఉపాదాన కారణం కావడానికి సాధ్యం కాలేదు. అందుచేత మట్టి ముద్ద కుమ్మరివానిని అపేక్షిస్తున్నది, కుమ్మరివాడు మట్టి ముద్దను ఆపేక్షిస్తున్నాడు. అందుచేత, కారణాలు వేరు వేరు అవుతున్నాయి. కానీ, ప్రస్తుతంలో బ్రహ్మం అనే వస్తువు జ్ఞానశక్తులతో కూడినది కనుక, తానే నిమిత్త కారణంగా, ఉపాదాన కారణంగా, సహకారి కారణంగా ఉండడానికి ఏ విధమైన అడ్డు లేదు– అని తెలియాలి.

శ్రుతులలో, స్మృతులలో వర్ణింపబడిన సృష్టిప్రకరణాలలో సర్వేశ్వరుడు "నేనే జగత్తుగా అవుతున్నాను" అని, "స ఏవ సృజ్యః స చ సర్గకర్తా" (సృష్టించేవాడను, సృష్టింపబడేవాడను నేనే) అని చెప్పడానికి తగినట్లుగా, ఇంతకు ముందు చెప్పిన మూడు కారణాలు సర్వేశ్వరుడు అయితే తప్ప, ఆ విధంగా చెప్పడం సరిపోదు కనుక,

మూడు విధాలయిన కారణాలు భగవంతుడే అవుతున్నాడు - అని ఒప్పుకొని తీరాలి.

జగత్తు అనేది చేతనాచేతన స్వరూపంగా కదా కనబడుతున్నది. ఆ విధంగా ఉండగా, సర్వేశ్వరుడు జగత్తుగా అవుతున్నాడు-అని చెప్పడం ఏ విధంగా పొసగుతుంది? అని అంటే, "నేనే జగత్తుగా అవుతున్నాను" అనేదానికి "చేతనాచేతనాలను శరీరంగా కలిగిన జగత్తు అవుతున్నాను" అని అర్థాన్ని చెప్పుకోవాలి. జగచ్ఛబ్దం భిన్నప్రమాణగమ్యాలైన బ్రహ్మను, జగత్తును తెలియజేస్తుందా, మరి? అని అంటే, దేవదత్తాదిశబ్దాలు భిన్నప్రమాణాలతో తెలియబడే శరీరాన్ని, ఆత్మను తెలియజేసేటట్లే, ఇక్కడ కూడా తెలియజేయవచ్చు- అని తెలియాలి.

ఈ విషయం ఉండనివ్వండి. అన్ని శబ్దాలుకూడా అపర్యవసానవృత్తిద్వారా సర్వేశ్వరుని నిర్దేశిస్తాయి- అనేది వేదాంతం అని తెలిసిన పండితుల నిర్ణయం.

(పదాలకు రెండు రీతులలో అర్థాన్ని చెప్పే సామర్థ్యం ఉన్నది. ఆ రెండు రీతులు ఏమి అంటే, పర్యవసానవృత్తిశక్తి, అపర్యవసానవృత్తిశక్తి అనేవి ఆ రెండు. ఈ రెండిటిలో పర్యవసాన వృత్తిశక్తి అంటే, ముఖ్యవిశేష్యాన్ని తెలియజేయకుండా, విశేషణ మాత్రంలో పర్యవసానాన్ని పొందే శక్తి, ఇది అముఖ్యవృత్తి అని అనబడుతుంది. ఇది లోకవ్యవహారంలో వ్యవహరింపబడేదే. అంటే, పక్షి, పశువు, మనుషుడు అని అంటే, పక్షి శరీరాన్ని, పశు శరీరాన్ని, మానవ శరీరాన్ని కలిగిన

ఆత్మలు– అని అర్థాన్ని గ్రహించడమే. ఇక, రెండవది అయిన అపర్యవసాన వృత్తి అంటే, ముఖ్యవిశేష్యం వరకు అర్థాన్ని తెలియజేస్తే తప్ప ఆగకుండా ఉండడం. దీనికి ముఖ్యవృత్తి అని పేరు. ఇది వేదాంతంలో వ్యవహరింపబడే వృత్తి. అది ఏమంటే, పక్షి, పశువు, మనుష్యుడు అని అంటే, పక్షిశరీరాన్ని, పశు శరీరాన్ని, మానవ శరీరాన్ని కలిగిన జీవాత్మలకు అంతర్యామిగా ఉండే పరమాత్మ అని విశేష్యపర్యంతంగా అర్థాన్ని గ్రహించడమే. )

ఇక అన్ని పదాలు భగవంతునే నిర్దేశిస్తాయి– అనే విషయాన్ని ఇంకొక విధంగాకూడా చెప్పవచ్చు. "దేవదత్తుడు తెలుసుకుంటున్నాడు" అనే వాక్యాన్ని గమనిద్దాం. ఇక్కడ "తెలుసుకోవడం" అనేది దేవదత్తుడు అనే జ్ఞానం లేని శరీరానికి వీలు కాదు. దేవదత్తుడై ఉండడం ఆత్మకు సాధ్యం కాదు. ఇక మరి, ఈ వాక్యానికి ఏ విధంగా అర్థాన్ని గ్రహించాలి? అని అంటే, దేవదత్తుడనే శరీరాన్ని కలిగిన ఆత్మ తెలిసికొంటున్నది– అనే అనే అర్థాన్ని గ్రహించాలి.. దేవదత్తుడై ఉండడం అనేది ఆత్మకు వీలు కాకపోయినా, దేవదత్తుడనే శరీరాన్ని తనకు ఆధారంగా కలిగిన ఐక్యంచేత, ఆ దేవదత్తుడనే శబ్దం ఆత్మను తెలియజేస్తుంది. వేదంలో, పరమాత్మకు కూడా జీవాత్మ శరీరంగా ఉంటాడు– అని చెప్పబడినందున, ఆత్మను నిర్దేశించే పదాలు అపర్యవసాన వృత్తిద్వారా పరమాత్మను నిర్దేశిస్తాయి– అని తెలియాలి. జీవాత్మగా ఉండడం పరమాత్మకు సాధ్యం కాకపోయినా, జీవాత్మను తాను శరీరంగా కలిగి ఉండే ఐక్యంచేత, జీవాత్మను నిర్దేశించే శబ్దం పరమాత్మను నిర్దేశిస్తుంది– అని తెలియాలి.

అందుచేత, ఈ విధంగా దేవదత్తుడు అనే పదానికి శరీరం, ఆ శరీరంతో కూడిన ఆత్మ, దానికి కూడా అంతరాత్మగా ప్రకాశించే పరమాత్మ- అనే ఈ మూడు అర్థం. ఈ న్యాయం ద్వారా ఘటపటాది సమస్త పదాలు పరమాత్మనే నిర్దేశిస్తాయి. ఈ అభిప్రాయాన్ని అనుసరించే ఏ విధమైన భ్రాంతి, విస్మృతి మొదలైన దోషాలు లేని జ్ఞానాన్ని కలిగిన ఆళ్వారులు

"కడల్ ఞాలమ్ శెయ్ దేనుమ్ యానే ఎన్నుమ్
కడల్ ఞాలమ్ ఆవేనుమ్ యానే ఎన్నుమ్
కడల్ ఞాలమ్ కొండేనుమ్ యానే ఎన్నుమ్
కడల్ ఞాలమ్ కీండేనుమ్ యానే ఎన్నుమ్
కడల్ ఞాలమ్ ఉండేనుమ్ యానే ఎన్నుమ్---"

(నా కుమార్తె --సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ లోకాన్ని సృష్టించినదానను నేనే- అని అంటున్నది. ఈ సముద్రాన్ని చుట్టూ కలిగిన జగత్తులో అనుప్రవేశించి ఉండేదానను నేనే -అని అంటున్నది. సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ జగత్తును బలి చక్రవర్తి దగ్గర దానంగా పొందినదానను నేనే- అని అంటున్నది. వరాహరూపాన్ని ధరించి సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ భూమిని గుచ్చి ఎత్తినదానను నేనే- అని అంటున్నది. ప్రళయ కాలంలో సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ లోకాన్ని కడుపులో పెట్టుకున్నదానను నేనే- అని అంటున్నది)

అని అంటూ సర్వేశ్వరుడు చేసిన కార్యాలు అన్ని, తమను ఆ సర్వేశ్వరునిగా భావించి, తాము చేసినట్లుగా చెప్పారు. ఇంతే కాక, ఆళ్వారులు

పుకళు నల్లొరువనెన్గో! పొరు విల్ శీర్ పూమి ఎన్గో!

తికళుమ్ తణ్ పరపై ఎన్గో! తీ ఎన్గో! వాయువెన్గో!

నిగళు మాకాశ మెన్గో! నీళ్ శుడర్. ఇరండు మెన్గో!

ఇగళ్విలివ్వనైత్తు మెన్గో! కణ్ణనై క్కూవుమాఱే

(విలక్షణమైన గుణాలను కలిగిన సాటి లేనివాడు అని అందునా! సాటి లేని అతిశయాన్ని కలిగిన భూమి అని అందునా! ప్రకాశించే చల్లని జలాశయం అని అందునా! అగ్ని అందునా! వాయువందునా! అంతటా వ్యాపించి ఉండే ఆకాశం అందునా! పెద్దగా ఉండే రెండు జ్యోతులు, అంటే, సూర్యచంద్రులు అందునా! ఏ విధమైన లోటు లేని ఈ సకల వస్తువులు అందునా! శ్రీకృష్ణుని నేను ఏమని పిలువగలను?)

అన్ని విధాలుగాను అన్ని వస్తువులుగానూ ఉండే భగవంతుని ఏమని చెప్పి పిలువను?– అని వేదాంతంలోని అంతరార్థాలను అనుగ్రహించారు. ఈ అభిప్రాయాన్ని దృష్టిలో పెట్టుకునే "తత్త్వమసి" –నీవు అదిగా ఉన్నావు– అనే వాక్యం ఆచార్యుడు శ్వేతకేతువును చూచి ఉపదేశించాడు. వామదేవుడు" "అహం మను రభవం సూర్యశ్చ" – (నేను మనువును, సూర్యుడను అయినాను) అని అన్ని పరబ్రహ్మ స్వరూపమని తెలిసికొని, " నేను మనువుగానూ, సూర్యునిగాను అయ్యాను"– అని అన్నాడు. ప్రహ్లాదుడు కూడా "మత్తః సర్వం అహం సర్వమ్" అని "అన్నీ నేనే అయి ఉన్నాను"– అని ఆ విధంగానే పలికాడు.

ఇంతవరకు చెప్పిన దానినిబట్టి, విశిష్టాద్వైతం అనేదానికి చేతనాచేతనాలను శరీరంగా కలిగిన బ్రహ్మ వస్తువు కంటే వేరే ఏమీ లేదు– అని, ఆ వస్తువు చేతనాచేతనాలను శరీరంగా కలిగినదై ఉన్నా, చేతనాచేతనాలకు కలిగే వికారం, సుఖదుఃఖాలు దానికి కలగడం లేదు అని, బ్రహ్మమే నిమిత్త, ఉపాదాన, సహకారి కారణమై ఉన్నదని, అన్ని బ్రహ్మస్వరూపమని, అన్ని పదాలు అతనిని నిర్దేశిస్తాయి అని, ఈ విషయాన్ని వేదాంతంలోని సూక్ష్మమైన అర్థాన్ని తెలిసినవారు వ్యక్తం చేశారు– అని చెప్పబడినది.

ఈ విశిష్టాద్వైతం అనే పదం అనేకవిధాలుగా చెప్పబడిన, వేదానికి అనుగుణంగా చెప్పే అర్థాలను అనుసరించినది– అనే విషయాన్ని గమనిద్దాం.

వేదం తమోగుణ రజోగుణ సత్వగుణాలతో కూడిన చేతనులు అందరూ, వారు వారు ఉండే స్థితికి తగినట్లుగా హితాలను చెప్పడం కోసం వచ్చినది కనుక, ఆ వేదంలో చెప్పబడినవి అన్నీ సత్యమైనవే– అని గ్రహించాలి. వేదం అందరికీ మంచిని చెప్పడం కోసం వచ్చినది అయినట్లయితే, పరహింసారూపమైన అభిచారయాగం అయిన శ్యేనయాగం మొదలైనవానిని విధించకూడదు కదా! (అభిచారం అంటే, ఒకనిని హింసించడం కోసం అధర్వణ వేదంలో చెప్పబడిన రీతిలో మంత్రాలతో చేయబడే శ్యేనయాగం మొదలైన కర్మలు. ఇది మారణం, మోహనం, ఉచ్చాటనం, విద్వేషణం, స్తంభనం, వశీకరణం అని ఆరు విధాలుగా ఉంటుంది.

శ్యేనయాగం అంటే డేగతో చేసే యాగం. ఈ యాగం శత్రువులను చంపడం కోసం చేసే యాగం. ఈ యాగాన్ని తగిన విధిలో క్రమానుసారంగా చేసేవారైతే, విరోధులు నశిస్తారు. దీనిని ప్రత్యక్షంగా తెలియవచ్చు. )

"శ్యేనేన అభిచరన్ యజేత" అని విధించబడినందున హింసను కలిగించడంకోసం ఈ యాగం చేయబడుతున్నదని తెలుస్తున్నదికదా. ఆ విధంగా ఉండగా, వేదం అందరికీ హితాన్ని చెప్పడం కోసం వచ్చింది– అని ఏ విధంగా చెప్పడానికి వీలవుతున్నది? అని అంటే, వేదం కొన్నిచోట్ల అదృష్టమైన ఫలాలను చెప్పింది. ఆ ఫలాలను శాస్త్రవిశ్వాసాన్ని కలిగిన పెద్దలే నమ్ముతారు. కంటికి స్పష్టంగా ఏమి కనిపిస్తాయో, అవే నిజమైనవి, మిగిలినవి అన్నీ అసత్యమైనవి అని తలచే నాస్తికులు మొదలైనవారికి ఈ అదృష్ట ఫలాలలో నమ్మకం కలగదు.. ఈ విధంగా నమ్మకుండా ఉండే వీరికి కూడా నిజమని విశ్వాసం కలిగించేటట్లు చేయడం కోసం శ్యేనయాగం మొదలైన అభిచార యాగాలను వేదం విధించినందున, ఈ విధమైన అభిచార యాగాలను విధించే శ్రుతులతో పాటు, ఏ విధమైన తేడా లేకుండా వేద వాక్యాలు అన్ని ప్రమాణం అవుతాయి– అని మనం గ్రహించవచ్చు.

వేదవ్యాలు అనేక విధాలుగా ఉంటాయి. వాటిలో ఉండే ప్రకారాలు ఏమి అంటే, భేదశ్రుతి, అభేదశ్రుతి, సగుణ శ్రుతి, నిర్గుణ శ్రుతి, ఘటక శ్రుతి మొదలైనవి. ఈ విశిష్టాద్వైతపదంలో అద్వైతం అని ఈశ్వరుఢు, విశిష్టపదంచేత చేతనాచేతనాలు తెలియజేయబడ్డాయి. ఇందువల్ల, భేదశ్రుతికి అర్థం పొసగి ఉండడం స్పష్టమవుతున్నది. అభేద శ్రుతి అనేది,

బ్రహ్మం ఒక్కటే ఉన్నది, వేరు ఏమీ లేదు అని చెప్పే శ్రుతియే. ఈ విశిష్టాద్వైతపదంలో అద్వైతమని అన్నందున చేతనాచేతనాలను శరీరంగా కలిగిన బ్రహ్మం తప్ప వేరొకటి ఏదీ లేదు అని చెప్పబడింది. అందుచేత అభేదశ్రుతికి అర్థం చాలా చక్కగా పొసగింది– అని చాలా సులభంగా తెలియవచ్చు.

సగుణ శ్రుతి అనేది, బ్రహ్మం జ్ఞానం శక్తి సౌశీల్యం మొదలైన గుణాలను కలిగినది– అని తెలియజేస్తున్నది. ఈ విశిష్టాద్వైతపదంలో చేతనాచేతనాలను శరీరంగా కలిగినది, బ్రహ్మం– అని చెప్పబడింది. తనతో సాటి, తనకు మించిన మేటి ఎవరూ లేనివాడైన సర్వేశ్వరుడు చేతనాచేతనాలను శరీరంగా కలిగి ఉండడం అనేది తన సౌశీల్యం, సౌలభ్యం మొదలైన గుణాల వల్లనే. అందుచేత ఇందులో సగుణ శ్రుతికి అర్థం పొసగి ఉన్నది అనే విషయాన్ని గమనించవచ్చు.

ఇక నిర్గుణ శ్రుతికి బ్రహ్మానికి హేయ గుణాలు ఏమీ లేవు –అని చెప్పడమే ఉద్దేశం. ఈ విశిష్టాద్వైతపదంలో బ్రహ్మం చేతనాచేతనాలను శరీరంగా కలిగి ఉన్నప్పటికీ, చేతనాచేతనాలకు తగిన వికారాలు, సుఖదుఃఖాలు మొదలైనవి ఏవి సర్వేశ్వరునకు లేవు– అని చెప్పబడినందున, ఇందులో నిర్గుణ శ్రుతికి కూడా అర్థం చాలా అందంగా సమన్వయం కావడం గమనించాలి. చివరిగా, ఘటకశ్రుతి అనేది బ్రహ్మం చేతనా చేతనాలలో అంతర్యామిగా చేరి ఉండే స్థితిని చెబుతున్నది. చేతనాచేతనాలను శరీరంగా కలిగిన బ్రహ్మం అనేది ఈ

విశిష్టాద్వైతపదానికి అర్థం కనుక, ఈ ఘటకశ్రుతికి కూడా అర్థం ఏ విధమైన బాధ లేకుండా, సమన్వయం కావడాన్ని భావించాలి.

ఇంకా, విశిష్టాద్వైతం అనే పదంలో సకలవేద సారార్థమైన అర్థపంచకం అంతర్భవించి ఉండడంకూడా గమనించవచ్చు. (అర్థపంచకం అంటే, ఆత్మ, పరమాత్మ, పురుషార్థం, ఉపాయం, విరోధి– అనే ఐదు విషయాల స్వరూపం) అది ఏవిధంగా అంటే, విశిష్టపదంచేత పరమాత్మ స్వరూపం చెప్పబడింది. అందులో ఉపాయ స్వరూపం కూడా అంతర్భవించి ఉన్నది. విశేషణంచేత ఆత్మస్వరూపం, విరోధిస్వరూపం సూచింపబడ్డాయి. విశేషణంచేత ఆత్మ నిర్దేశింపబడినందున, దీనిని కలిగిన ఈశ్వరునకు ఈ ఆత్మ శేషం అనేది స్పష్టమవుతున్నది. ఈ విషయం స్పష్టం కాగానే, భగవంతుని ముఖవికాసానికి తగిన కైంకర్యాన్ని చేయడమే ఆత్మకు పురుషార్థం అని తెలియవచ్చు. ఈ విధంగా ఈ విశేషణంలో పురుషార్థస్వరూపం కూడా చెప్పబడింది. విశేషణంచేత విరోధిస్వరూపం ఏ విధంగా చెప్పబడింది? అని అంటే, విశేషణపదంచేత అచేతనం తెలుపబడినందున విరోధిస్వరూపం చెప్పబడింది– అని తెలియాలి. అచేతనం ఆత్మకు ఎల్లప్పుడూ అడ్డుపడేదిగాను, హేయంగానూ ఉంటుంది. ఇది ఈ విధంగా ఉంటుంది అనే విషయాన్ని ఈ క్రింది వృత్తాంతంద్వారా తెలియవచ్చు.

సర్వేశ్వరుడు ఆళ్వారుల విషయంలో ఉండే మిక్కిలి ప్రీతిచేత వారిని పరమపదానికి వారి పాంచభౌతికశరీరంతో పాటు తీసుకుని పోవాలని ఆశపడ్డాడు. అప్పుడు ఆళ్వార్లు భగవంతుని ఉద్దేశించి

పలుకుతూ "స్వామీ! ఈ శరీరం విరోధిగాను, హేయంగాను ఉండే స్వభావాన్ని కలిగినది. అందుచేత దీనిని పోగొట్టి అనుగ్రహించాలి" అని ప్రార్థించారు. అప్పుడు, చదరంగం అనే ఒక ఆటలో లగ్నమైనవానికి ఇతరులు చెప్పే మాట చెవి పడకుండా ఉండేటట్లు, సర్వేశ్వరుడు ఆళ్వారుల మాటలను పెడచెవిని పెట్టాడు. అప్పుడు, ఆ స్థితిని గమనించిన ఆళ్వారులు

మంగ ఒట్టు ఉన్ మామాయై తిరుమాలిరుమ్ శోలై మేయ
నంగళ్ కోనే యానే నీ యాగి ఎన్నై అళిత్తానే
పొంగైమ్బులనుమ్ పొఱి యైందుమ్ కరుమేందిరియ మైమ్బూదమ్.
ఇంగివ్వుయిరేయ్ పిరకిరుది మానాంగార మనంగళే

(వనాద్రి పై వేంచేసి ఉండే మా స్వామీ! మనమిద్దరం కలసి ఒక్కరమే అనే రీతిలో నన్ను ఏలినవాడా! భ్రమను కలిగించే శబ్దం మొదలైన ఐదు విషయాలు, జ్ఞానేంద్రియాలు ఐదు, కర్మేంద్రియాలు ఐదు, పంచభూతాలు, ఈ సంసార దశలో జీవునితో కూడిన మూల ప్రకృతి, మహత్తు, అహంకారం, మనసు అనే ఈ మహామాయను తొలగించాలి)

అని అంటూ శరీరంయొక్క హేయతను ప్రస్తావించి పలికారు. ఆ తరువాత సర్వేశ్వరుడు ఆళ్వారులకు గల విరోధిని పోగొట్టి, నిరతిశయమైన ఆనందం అనుగ్రహించాడు.

సాంప్రదాయిక వ్యాస మాలిక–14

## విద్యాదానమహిమ

(కాంచీ మహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారి ద్రావిడవ్యాసానికి అనువాదం)

విద్యాదానం అనే పదం రెండు విధాలైన అర్థాలను ఇస్తుంది. "కర్తృకర్మణోః కృతిః "అనేది వ్యాకరణ సూత్రం కనుక విద్యాకర్మకమైన దానం అని, విద్యాకర్తృకమైన దానం అని రెండు విధాలుగా అర్థం వస్తుంది. మహాబలిదానం అంటే, మహాబలి చేసిన దానం అని అర్థం వస్తుంది. స్వర్ణదానం, భూమి దానం అని అంటే, తత్కర్మకమైన దానం, అంటే, స్వర్ణాన్ని దానం చేయడం, భూమిని దానం చేయడం అని అర్థం వస్తుంది. ఈ విధంగా రెండు రీతులలో ఉండే అర్థాలను చెప్పడం ఆసహజం ఏమి కాదు, సర్వానుభవ సిద్ధమే.

విద్యాకర్మకమైన దానం అని అంటే, ప్రవచనం మొదలైనవాటి ద్వారా విద్యను నేర్పించడం– అని అర్థం వస్తుంది. విద్యాకర్తృకమైన దానం అని అంటే, "విద్యా దదాతి వినయమ్", అనే విధంగా విద్య అనేది తాను పొందించే ప్రయోజనాన్ని చెప్పినట్లు అవుతుంది. విద్యాదాన మహిమను ఉపన్యసించాలి అనే నియమనాన్ని పొందినవారు విద్యాకర్మకదానాన్ని మాత్రమే తెలిసి ఉంటారు. ఎందుకంటే, అటువంటి కార్యంలో వారు ప్రవర్తించినవారు కనుక. దానిని గూర్చి ముందుగా కొన్ని విషయాలు విజ్ఞాపనం చేయబడుతున్నాయి.

దానాలు అనేక విధాలుగా ఉంటాయి. అన్నదానం, భూమి దానం, వస్త్ర దానం, రజత దానం, స్వర్ణ దానం అని ఈ విధంగా చెప్పబడే

గొప్ప దానాలు కొన్ని ఉన్నాయి. "అంబరమే తణ్ణీరే శోఱే అఱమ్ శెయ్యుమ్ ఎంబెరుమాన్ నందగోపాలా! " కానీ తిరుప్పావై పాశురం ప్రసిద్ధం కదా. వేదాంత దేశికులు యాదవాభ్యుదయ కావ్యంలో "అధిచకార వదాన్యమణేః శ్రియమ్ వ్యధితకల్పతరో రుపకల్పతామ్" అని అంటూ నందగోపాలుని ఔదార్యాన్ని అపరిమితంగా కీర్తించారు. చింతామణి వలె నందుడు దానాన్ని చేశాడని, కల్పవృక్షాన్ని కూడా అతడు మించిపోయాడని ఇక్కడ చెప్పబడింది.

దానాలు అన్నిటిలోనూ అన్నదానం చాలా గొప్పదని సామాన్యంగా చెప్పబడుతుంది. ఎందుకంటే, మిగిలిన దానాలలో చాలు అనే మాట రాదు. ఎంతగా ఇచ్చినప్పటికీ తీసుకొని, ఇంకా ఇంకా ఇవ్వాలని, ఇంకా ఇంకా తీసుకోవాలని తోస్తుంది. అన్నాన్ని చేతిలో ఇచ్చినట్లయితే, ఇంకా ఇంకా తీసుకొని మూట కట్టి పెట్టుకోవాలని తోస్తుంది. కానీ. వ్యక్తులను కింద కూర్చోబెట్టి ఆకుపరచి అన్నాన్ని పెట్టి, తినమని చెప్పి అన్నాన్ని పెట్టడం ప్రారంభిస్తే, అప్పుడు తప్పకుండా కొంతసేపటికి "ఇక చాలు" అనే మాట వచ్చి తీరుతుంది. దీనిని బట్టి పెద్దలు దీనికి అలంకారం అనే పేరు పెట్టారు కాబోలు. అలం అని అంటే ఇక చాలు అని. ఇక చాలు అని అనిపించేది. అలంకారం అనబడుతుంది.

ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన అన్నదానం కాని, ఇంకా మిగిలిన ఏ దానం కాని విద్యాదానానికి ఏకదేశంలో కూడా సరిపోవు. మిగిలినవి అన్నీ కొంచెం కాలం తరువాత సహాయపడి అంతరించిపోతాయి. విద్య అటువంటిది కాదు కదా.

యజుర్వేదంలో మూడవ కాండం మొదటి ప్రశ్నలో " మనుః పుత్రేబభ్యో దాయం వ్యభజత్" అని ఆరంభించి, ఒక ఉపాఖ్యానం చెప్పబడినది. అంటే, మనుమహర్షి తన పుత్రులకు దాయభాగాన్ని విభజించి ఇచ్చాడు. నాభానేదిష్టుడనే అతని ఒక పుత్రుడు మాత్రం వేదాన్ని అభ్యసించడానికి వేరొక ఊరికి వెళ్లి అక్కడ నివసిస్తూ ఉన్నందున, అతనికి భాగాన్ని విభజించి ఇవ్వలేదు. తరువాత, అతడు ఊరికి తిరిగి వచ్చి చేరిన తరువాత, తండ్రి తనను మాత్రం విడచి పెట్టి, మిగిలిన కుమారులకు దాయభాగాన్ని విభజించి ఇచ్చిన విషయాన్ని తెలుసుకొని, "ఎందుకు నాకు భాగాన్ని పంచి ఇవ్వలేదు ?"అని తండ్రిని అడిగాడు. దానికి అతని తండ్రి, "నీకు నేను దాయభాగాన్ని విభజించకుండా లేను" అని పలికి, "అంగిరస ఇమే సత్రామాసతే" అని ఆరంభించి అతని చెవిలో ఒక విద్యావిశేషాన్ని ఉపదేశించి, దానిని ఉపయోగపరచవలసిన సందర్భాన్ని కూడా తెలియజేసి, " దీనివల్ల నీవు ధనికుడవు కాగలవు "అని అన్నాడు. తరువాత, ఇతనికి, రుద్రునకు మధ్య జరిగిన ఉక్తి ప్రత్యుక్తులు అటు ఉండనివ్వండి. తండ్రి అయిన మనువు ఇతనికి ఇచ్చిన విద్య ఇతనికి అనాయాసమైన జీవనోపాయం అయినది. అందుచేత విద్యాప్రదానం చేస్తే, అది శాశ్వతమైన ఉపకారం చేసినట్లు అవుతుంది.

ఒక మహాకవి ఏమని చెప్పాడు అంటే, " అంగుష్ఠాగ్రపరీణాహి జిహ్వాగ్రాయాసభీరవః, సర్వాంగీణ పరిక్లేశం సహంతే హంత! సంతతమ్" అని అన్నాడు. బొటనవేలు పరిమాణాన్ని కలిగిన నాలుకలోని భాగాన్ని

చిన్నతనంలో శ్రమపెట్టడానికి భయపడేవారు, తరువాత కాలంలో వారు జీవించినంతకాలం అన్ని అవయవాలను శ్రమపెట్టి జీవించవలసినవారు అవుతారు– అని దీని అర్థం. ఇందువల్ల తెలిసిన అర్థం ఏమంటే, చిన్న వయస్సులో నాలుకలోని చిన్న భాగాన్ని శ్రమ పెట్టి విద్యను నేర్చుకుంటే, తరువాత కాలం అంతా సుఖంగా జీవితం గడపవచ్చు. ఆ విధంగా నేర్చుకోనివారు తరువాత జీవించడం కోసం అన్ని అవయవాలను శ్రమ పెట్టుకోవలసి వస్తుంది. తలతో మాటలను మోసి కాళ్లతో చాలా దూరం నడచి, చేతులతో కట్టెలను బ్రద్దలు చేయడం మొదలైన కార్యాలను చేసి, ఈ విధంగా అనేక విధాలయిన అవయవాలను శ్రమ పెట్టి జీవించవలసి ఉంటుంది. స్వల్పకాలం నాలుకలోని చిన్న భాగాన్ని మాత్రమే శ్రమపెట్టుకోవడానికి సంకోచించినవారికి తరువాత జీవించిన కాలం అంతా ఈ విధంగా శ్రమపడి జీవించవలసి వస్తుంది. కనుక, విద్యను నేర్వడమే మంచిది అని తెలిపినట్లైనది.

అన్నదానం, వస్త్రదానం మొదలైన దానాలను ఒక క్షణ కాలంలో చేసి ముగించవచ్చు. ఆ విధంగానే, క్షణకాలంలో పొందవచ్చు కూడా. విద్యాదానం ఒక క్షణంలోనో, ఒక మాసంలోనో, ఒక సంవత్సరంలోనో చేయడానికి సాధ్యపడేది కాదు. పొందడానికి వీలైనదికూడా కాదు. ఇంతకుముందు ప్రస్తావించిన వైదికమైన ఉపాఖ్యానంలో నాభానేదిష్టుడు పొందినట్లుగా మనమందరం పొందడం సాధ్యం అవుతుందా! కాదు కదా! "వింశత్యబ్దే విశ్రుతనానావిద్యః" అనే విధంగా ఉండే అతిశయాన్ని మనం పొందే అవకాశం ఉన్నదా. ఘటికాశతం అమ్మాళ్ "అనారాధ్య కాళీ

మనాస్వాద్య గౌడీం వినా మంత్రతంత్రైః" అని అంటూ పలికినట్లుగాను, " దేవీం వాచ ముపాసతే హి బహవః సారం తు సారస్వతం జానీతే నితరామసౌ గురుకులక్లిష్టో మురారిః కవిః" అనే మురారి కవి చెప్పినట్లుగాను, గురుకులంలో చిరకాలం శ్రమపడి నానావిద్యలను పొందవలసి ఉన్నది. దానికి ఎన్నో ఆటంకాలు కలుగుతాయి. " అనంతపారం బహు వేదితవ్యం అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః" అని చెప్పబడుతున్నది కదా. " తస్మాత్ బాల్యే వివేకాత్మా యతేత శ్రేయసే సదా" అనే ప్రహ్లాదుడు చెప్పినట్లుగా, చిన్న వయస్సుయనుండి విద్యను అభ్యసించవలసి ఉన్నది. దానికి ఏర్పడే బహువిధాలైన అసౌకర్యాలను పోగొట్టి, ఆవశ్యకమైన సౌకర్యాలను కలుగజేసి, సద్వారకంగానూ, అద్వారకంగాను విద్యాప్రదానాన్ని చేసే మహానుభావులు గొప్పదైన తపస్సును చేసినవారు-< అని అనడంలో అడ్డు ఉన్నదా?

బెంగుళూరులోనూ తిరువల్లిక్కేణిలోను ఉభయ వేదాంత ప్రవర్ధనీ అని, వేదవేదాంతవర్ధినీ అని సభలను శాశ్వతమైన నిధితో ఏర్పాటుచేసి, వైదిక విద్యాభివృద్ధి చేసినవి శ్రీ పరకాల మఠం, శ్రీ అహోబిలమఠంవంటి కొన్ని మఠాలు. ఈ విధంగా చేస్తూ వచ్చే ప్రయత్నాలు ప్రశంసించదగినవి కదా. "శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధేః చలనకారణమ్, ఉపదేశాత్ హరిం బుద్ధ్వా విరమేత్ సర్వకర్మసు" అనే ప్రమాణవచనం ఉపదేశం పొందడంలోని ఆవశ్యకతను తెలుపడంకోసం ఏర్పడినదే తప్ప, శాస్త్ర జ్ఞానం సంపాదించనక్కరలేదు- అని నిషేధించడంకోసం వచ్చినది కాదు కదా. అది శాస్త్రజ్ఞానం లేనివారు ఉపదేశం చేయడం వీలు కాదు.

పొందడమూ వీలు కాదు. "మాయాం న సేవే భద్రం తే వృథా న ధర్మమాచరే, శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్ధనమ్" అనే సంజయుని మాటను ఇక్కడ స్మరించాలి.

ఈ విధంగా, ఇంతవరకు, విద్యాకర్మకమైన దానంలోని గొప్పతనం తెలియజేయడం జరిగింది. ఇక, విద్యాకర్తృక దానంలోని మహిమను తెలుపడం జరుగుతుంది. అయితే, ఇది ప్రత్యేకంగా చెప్పవలసినది కాదు. విద్య సకల హితాలను ఇవ్వగలిగినది అనేదానినిబట్టే కదా, విద్యాదానానికి మహిమ ఏర్పడింది. " విద్యా దదాతి వినయం, వినయాత్ యాతి పాత్రతామ్, పాత్రత్వాత్ ధన మాప్నోతి, ధనార్ధర్మః, తతః సుఖమ్" అనే వచనంవల్ల విద్య చేసే దానాలను తెలియవచ్చు. విద్య అహంకారానికి హేతువు కావడం కొందరి విషయంలోనే. అరకొరగా విద్యను పొందినవారికే అహంకారం కలుగుతుంది. వారు, "నేనే పండితుడను, నేనే సర్వజ్ఞుడను" అని అహంకరిస్తారు. పుష్కలంగా విద్యను పొందినవారు "నమంతి సంతః త్రైలోక్యాదపి లబ్ధుమ్ సమున్నతిమ్" అనే విధంగా తలను వంచి, అణకువతో మెలుగుతారు. శ్రీరాముడు చిత్రకూటంలో ఉన్నప్పుడు, కొండ చరియలలో పాములు ఉండే రీతిని సీతకు తెలిపే సందర్భంలో అతడు తెలిపినట్లుగా పలికే కంబ మహాకవి, ఒక్కొక్క సర్పం ఏనుగును మింగే విధంగా ఉన్నదట. ఆ విధంగా ఉండే సర్పాలు మునులు కొండపై నుండి కిందకు దిగడానికి, వారు కింద నుండి కొండపైకి ఎక్కడానికి తగినట్లుగా మెట్లు మాదిరిగా అమరి ఉన్నవట. పరమసాధువులై వెలుగుతున్నాయట. ఈ విధంగా అవి అణకువతో ఉండడానికి

ఉదాహరణను చెప్పాలని ప్రయత్నిస్తూ కంబమహాకవి. "కట్రఱిందవరెన అడంగి" (విద్యాభ్యాసం చేసి జ్ఞానాన్ని పొందినవారు అనేటట్లుగా అణకువతో ఉండి) అని అన్నారు. ఇక్కడ విద్యాభ్యాసాన్ని చేసి తెలిసినవారు– అనే సూక్తి గమనించదగినది. విద్యకు అందం వినయంవల్ల అని తెలిసినవారు– అని తాత్పర్యం. ఈ విధంగా పుష్కలమైన విద్య వినయాన్ని ఇస్తుంది. వినయం సత్పాత్రత్వాన్ని ఇస్తుంది. సత్పాత్రత్వంవల్ల సత్కారాలను పొందవచ్చు. దానివల్ల ధర్మరుచి కలుగుతుంది. దానివల్ల మహానందం కలుగుతుంది. ఇంతకంటే ఏమి కావాలి? విద్యాకర్తృకకదానం ఇటువంటి వైభవాన్ని కలిగినది కనుకనే విద్యాకర్మకదానం చాలా గొప్పది అయినది.